[illegible] గారిచే
రచియింపబడినవి.

| | రు | అ |
|---|---|---|
| కాశీమజిలీలు మొదటిభాగము | 1 | 8 |
| డిటో రెండవభాగము | 1 | 8 |
| డిటో 3 వభాగము | 1 | 12 |
| డిటో 4 వభాగము | 1 | 12 |
| డిటో 5 వభాగము | 1 | 8 |
| డిటో 6 వభాగము | 1 | 12 |
| డిటో 7 వభాగము | 1 | 12 |
| డిటో 8 వభాగము | 1 | 12 |
| డిటో 9 వభాగము | 1 | 12 |
| డిటో 10 వభాగము | 1 | 12 |
| డిటో 11 వభాగము | 1 | 12 |
| **ఇతరకవులవి.** | | |
| కాశీరామేశ్వరమజిలీలు | 1 | 0 |
| రామేశ్వరమజిలీలు | 1 | 0 |
| భట్టివిక్రమార్కకథలు | 1 | 0 |
| డిటోపెద్దది క్యాలికో బైండు | 2 | 0 |
| మదనకామరాజుకథలు | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| పన్నెండురాజులకథలు | 0 | 12 |
| పదహారురాజులకథలు | 0 | 12 |
| షట్చక్రవర్తుల కథలు | 0 | 12 |
| అరేబియన్ నైట్సుకథలు | 1 | 8 |
| గులేబకావళికథలు | 0 | 8 |
| వినోదకథాకల్పవల్లి | 3 | 0 |
| చమత్కారకథాకల్లోలిని | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |

| [illegible] | రు | అ |
|---|---|---|
| కాళిదాసచరిత్రము | 1 | 8 |
| భారతరమణీమణులు | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| శ్రీభక్త విజయము | 0 | 8 |
| మహాపతివ్రతకథలు | 0 | 8 |
| పాండురంగభక్త విజయము | 6 | 0 |
| శ్రీగురుభక్త విజయము | 5 | 0 |
| స్త్రీలవ్రతకథలు | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |
| డిటో మూడవభాగము | 0 | 6 |
| నాటకపుపద్యాలు | 0 | [illegible] |
| **శృంగారగ్రంథములు.** | | |
| స్త్రీపురుషరహస్యములు | 1 | 0 |
| సతీపతికుతూహలప్రేమ రహస్యములు | 2 | 0 |
| పడకటింటి రహస్యములు | 1 | 0 |
| పడకటింటి ముచ్చట్లు | 0 | 8 |
| రతిరహస్యము | 1 | 0 |
| వశీకరణతంత్రము | 2 | 0 |
| స్త్రీపురుష ప్రేమరహస్యములు | 1 | 0 |
| దాంపత్యరహస్యములు | 1 | 0 |
| **వేదాంతగ్రంథములు.** | | |
| సీతారామాంజనేయ సంవాదము క్యాలికో | 3 | 4 |
| డిటో సాదాబయిండు | 2 | 8 |
| శివబ్రహ్మైక్య రాజ యోగసారామృతము | 4 | [illegible] |

శ్రీరస్తు.

# మూడుచెప్పుదెబ్బలకథ

(అతిమనోహరమగుకథ.)

ఇది
ధవిళేశ్వరపు సోమలింగాచార్యులు గారిచే
రచియింపబడినది.



ప్రథమకూర్పు 1000 ప్రతులు



ప్రకాశకులు:—

మాదేటి సన్యాసయ్య అండ్ సన్సు,
ఆంధ్రాబుక్కుడిపో,
రాజమండ్రి.

కాకినాడ;—పట్టమట్ట శేషగిరిరావుగారి బార్జి ప్రెస్‌యందు ముద్రింపబడెను.

1932.

 [వెల రు 0—8—0.

# భూమిక.

మహాశయులారా !!

ఈపుస్తకమునందలి కథాసందర్భమునకు సాదరప్రయోగము ప్రధానముగుటచే మోటుపదంబైనను, తలమానికముగ "మూఁడు చెప్పుదెబ్బలకథ" యని యుంచకతీరినది కాదు. కథపేరువిన్నవారికీ పదము హాస్యాస్పదముగఁ గన్పట్టినను, దీనిఁజదివినవారలకీ శీర్షికయుక్తమని తోచకమానదు. ఇందలి విషయములు చరిత్రాధారములులేని కథాసందర్భములు. "బిడ్డలఁగన్నతల్లులకే నొప్పులబాధ" తెలియునన్నట్లు కల్పితపు కథలనువ్రాయుట బహుదుర్లభము. అయ్యది ప్రజారంజకమునుఁబొందుట మరియొకకష్టము. శక్తిసామర్థ్యములను యోచించుకొనక నిట్టిసాహసమునకుఁబూనిన నన్నుఁ బండితులు మన్నించి, యిందలి దోషంబులనుఁ దెల్పినచో గృతజ్ఞుఁడనై పునర్ముద్రణమున సవరించుకొనఁగలవాడనని విన్నవించుకొనుచున్నాఁడను.

ఇట్లు,

సంపాదకుఁడు.

శ్రీరామసహాయం.

# మూఁడుచెప్పుదెబ్బలకథ

## అనుక్రమణిక



# మూడు చెప్పు దెబ్బల కథ.



## 1. ప్రతిజ్ఞ.

భారత వర్షమునందుత్తర హిందూస్థానము ప్రతాపస్థానముగ ముఖ్యప్రదేశముగ నెన్నఁబడుచున్నది. అందు రాజపుత్రస్థానము రస పుత్రవీరులకుఁ బుట్టినిల్లు. అందనేకములగు స్వదేశస్వతంత్ర సంస్థానములు గలవు. ఆప్రదేశమునందు "వేదవతి" యను నది ప్రవహించుచున్నది. ఆ దేశ విజయపురాధీశ్వరుని సంస్థానముఁగలదు. దానికి వేదవతియను నగరరాజము ముఖ్యపట్టణము. అచట భారతదేశశిల్పులచే గొప్పగొప్ప సౌధములు నిర్మింపఁబడెను. అందొకసౌధమునందు రాజు నివసింపుచుండును. ఆసంస్థానము "విజయభూపాలుఁడ" ను పేరుగల రాజు పరిపాలించుచుండెను, చిరకాలమునుండియు వీరివంశమునకు విజయులని పౌరుషనామము బిరుదముగా సకలభూపతినామాంత ప్రభువులచేతను సార్థకనామముగఁ బిలువఁబడుచుండెను, విజయభూపాలుని పాలనమందు పదునెనిమిదిపరగణాలుగలవు. అందలిప్రజలురాజునందు మిగులభక్తితో మెలఁగుచుందురు. రాజును ప్రజలయొక్క కష్టనిష్ఠురంబులనుఁ బరిశీలించి, ప్రజలకష్టములే తనకష్టములుగ భావించి, ఎవరేమిఁజెప్పుకున్నను తానుస్వయముగవిచారించివలసిన సదుపాయములఁజేయుచుండును. అందుచే తమప్రభువునందుప్రజలకుభక్తివిశ్వాసములు మెండు. రాజధర్మములయందు బహుజాగరూకతతో మెలంగుచుండును. మంత్రిసామంతాదిభటవర్గంబు లెల్లరచేతను విజయునికీర్తి బాగుగా కొనియాడబడుచుండెను.

విజయభూపాలుని ప్రతిభ క్రమక్రమంబుగ దేశదేశములందంతటనువ్యాపించెను. ఇట్లుండయవనదేశభూపతియొక్కకుమార్తె గుణవతి

యనుఁబేరుగల యువతిం బెండ్లాడెను. నాటనుండియు గృహస్థధర్మంబు
లను నెరవేర్చుచు కాలముఁగడపుచుండెను. రాజ్ఞీరాజశేఖరుల యన్యో
న్య ప్రేమ కెల్లరును సంతసించుచుండిరి. పట్టపురాణిగుణవతికిఁ దగినట్లు
తమరాజ్యంబునందలి స్త్రీలకెల్లరకును, పాఠశాలలుంచి, అందుగృహ
స్థాశ్రమ విధివిధానంబులను, పాకశాస్త్రమును, చేతిపనులునుమున్న
గు కళలను నేర్పించుటకు వలసినంతధనం బొసంగెను. పాఠశాలయందుఁ
తగిన యుపాధ్యాయులను నియమించి, స్త్రీలనువిద్యావతులుగాఁ జేయ
కంకణముఁ దాల్చెను. వత్సరమునకొకసారి స్త్రీలనందరిని నొకచో
సమావేశపఱచి తానుఁగూడనాసభకుఁ బోయివారివారివిద్యావిశేషం
బులం బరీక్షించుచు, నుచితరీతులఁగు బహుమానంబు లర్పించుచు
స్త్రీవిద్యను మరింత ప్రోత్సాహపరచుచు ప్రసంగించుచుండును.

ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట రాజ్ఞీరాజశేఖరులమనంబు
నందు సంతానంబులేని విచారము నానాటికి వృద్ధియగు చుండెను.
"అపుత్రస్యగతిర్నాస్తి" యనెడు ధర్మసూత్రంబులనుదలంచుకొనుచు
రాజు రాజకార్యములందు విముఖుఁడై యంతిపురియందు చింతాక్రాం
తుఁడై కాలముగడపుచుండెను. ఇట్లువిచారించిన నేమిఫలముగలదని తమ
యాంతరంగిక ప్రధానినింబిలపించి తనకుఁగల మనోవిచారంబునుఁ
దెలియపరచెను. వెంటనేయాప్రధానిదైవజ్ఞులను పిలపించెను. నాహూ
యమానులగు నాజ్యోతిష్కులు రాజదంపతుల జాతకంబులఁ బరిశీ
లింపసాగిరి. గ్రహగతులను బరిశీలించి సంతానయోగంబు తప్పకగల
దనియు, ఏకపుత్రుండీదశయందే గలుగుననియుఁ జెప్పిరి. ఆస్థానపురో
హితులంబిలపించి గ్రహశాంతులంజేయ ననుజ్ఞనిచ్చిరి. మరల వైద్య
శాస్త్రవేత్తలనుబిలపించి సంతానంబు గలుగకపోవుటకు కారణంబులే
మని ప్రశ్నించెను ? రాజబంధుసమక్షంబున నాభిషగ్వరులిట్లు జెప్పఁ
దొడంగిరి. గర్భమందలి రజోదోషముచేనైనను, బీజమందలివీర్యదోష
ముచేనైనను శుక్లశ్శోణితసంయోగంబున జీవాణుసముదాయములకు
యాకర్షణశక్తి లోపించిన సంతానంబుగలుగ నేరదనివక్కాణించిరి. అట్టి
దోషంబులనుఁ బరిహరించుటకు గర్భవినోదంబను ఫలఘృతంబును
నౌషధంబుసేవించిన సన్సంతానంబుఁ బడయవచ్చునని యశ్వినీ దేవ

తులచే ప్రసాదింపఁబడిన యోగరాజంబనిఁజెప్పగా విని పరమానం దంబునొంది యొక శుభముహూర్తంబున నారాజదంపతు లిరువురును ఘలఘృతంబును సేవించుచుండిరి. ఇట్లుసేవించిన యారుమాసంబులకే రాజపత్నియగుగుణవతి గర్భంబుదాల్చి సాహసవంతుండగు సుపుత్రునిఁ బడసెను.

నాటిదినము పట్టణమందలి ప్రజలెల్లను మహదానందంబున తమప్రభువునకుఁ బుత్రుండుదయించెనని యుత్సాహముతో యుత్సవములం జేసి సంతోషసాగరంబున నీదులాడుచుండిరి. సామంతభూపాలురెల్ల రును తమరాజునకు వంశపావనుండగు సుతుండుదయించెనని విని సంత సించి, రత్నహారంబులును, వినోదంబులగు వాహనంబులును, చిత్ర విచిత్రములగు కిరీటంబులును, రథ, గజ, తురంగాదివస్తువిశేషంబులు కొల్లలుగావారివారిశక్తిననుసరించి కానుకలర్పించుకొనుచుండిరి. అవ్వి రాళంబులన్నింటిని విజయుఁడు సంతోషంబున స్వీకరింపుచు, నొక్క శుభముహూర్తంబున తనయునకు నామకరణంబొనర్ప సంకల్పించెను. దైవజ్ఞులచే సుహూర్తమునిర్ణయింపఁబడినది. ఇట్లుపెద్దలచేననుజ్ఞాతుఁడై సామంతభూపాలురనే గాక నేబదియారు దేశంబులనేలు రాజరాజ మండలి నాహ్వానము పంపుచు సన్నాహంబున, నెల్లరకును నుచితరీతులగు శుభలేఖలంపెను, బారసాల ముహూర్తమునకు పరసరప్రాంతరాజ్యమం డలి కొంతవఱకు విచ్చేయ వారికెల్లరకును యుచితసత్కారములం గావించెను. ఆవచ్చినరాజబంధుసమక్షమునందు విజయుండు భార్యాయు క్తుండై కల్యాణపీటయందాసీనుండై, యథావిధిగా పురోహితులచే స్వస్తివాచకంబులాశీర్వదింపఁగుమారునకు "విజయప్రసాదుండని" నామకరణంబుగావించెను. వచ్చిన రాజబంధు లెల్లరును నబ్బాలుని దీర్ఘాయుష్మంతుండగుగాకయని నాశీర్వదించిరి. నాటిదివసంబున గురు జనబంధుమిత్రులెల్లరితోడనుషడ్రసోపేతంబుగ సహపంక్తియుక్తుండై భుజించినవెనుక సహజమర్యాదలంగావింప వారివారి నిజనివాసంబుల కనిపె.

నాటనుండియు విజయ ప్రసాదుఁడు దినదినప్రవర్ధమానుఁడై గురువులయొద్ద విద్యనభ్యసించుచు కాలముగడపుచుండెను. విజయ

భూపాలుండును, గుణవతియును పుత్రసంతోషంబున కాలముఁగడపుచు ప్రజలనెల్లరచేతను మన్ననలందుచుండెను. విజయప్రసాదున కిరువదియేండ్ల ప్రాయము వచ్చెను. వివాహముజేయుటకు తల్లిదండ్రులు సంకల్పించుచుండిరి. పరిసరప్రాంతదేశాధీశ్వరులు గొందరు మీవిజయప్రసాదునకు వివాహమెప్పుడు జేయుదురు ? రూపలావణ్యవతియగు మాకన్యకనిచ్చి మీతోవియ్యమంద గుతూహలమొందుచున్నారమని గొందరును, మీప్రసాదునకీవత్సరము వివాహముఁ జేయనిశ్చయించినచో మానద్ద నొకకన్యకగలదనియు, ఆమె చిత్రపటమంపుడనికోరినచో పంపుచున్నామనిఁగొందరును, మాకన్యకంబెండ్లాడినఁ గొన్ని గ్రామంబు లరణంబుగానిత్తుమని గొందరును, తమతమ పుత్రికల ఛాయాపటములంపుచు ప్రతిజాబులకై నిరీక్షించుచుంటిమని గొందరును, వార్తలంపుచుండిరి. ఇట్లనేక ప్రాంతములనుండి యనేకవార్తలు ప్రతిదినమునువచ్చుచుండెను. ఈవార్తలుజూచినతోడనే తల్లిదండ్రులకు తమకుమారుని వివాహముజేయుమరింత యుత్సాహింపుచుండిరి. గాని వరప్రసాదుఁడు రూపలావణ్యాతిశయములకుమించిన కన్యకలనైనను, సహజబంధువులసంబంధములభించినదని సంతసించినను, వరప్రసాదుఁడు వివాహముఁజేసికొనుట కంగీకరింపఁడయ్యెను. తల్లిదండ్రులెంతబలవంతపెట్టినను వివాహమన్న సరకుసేయకుండెను. ఒక దినంబున తల్లిదండ్రులువిజయునిఁబిలచి తండ్రీ! వివాహమన్న బలుకరింపకుంటివి ? నీయుద్దేశ్యమేమనియడుగ నిప్పుడేమి పెండ్లియని సిగ్గుచే బలుకఁజొచ్చెను.

విజయా ? లేకలేక నీవొక్కరుండవే మావంశంబున నుద్భవించితివి. మేమును పెద్దవారమగుచుంటిమి. నీకుఁబెండ్లిగావించి మీదంపతులిరువురును కాపురముజేయుచుండ సంతోషంబునఁ గన్నులారఁ జూడ వేడుకంబొడముచున్నది, అదియునుంగాక రాజబంధువులతో వియ్యమంది సుఖసాగరంబునఁ గాలంబు, గడపుచు రాజమర్యాదలం బొందుట మానవధర్మంబు. సంసారికధర్మంబుల నిర్వర్తించుకొనుట లోకమునందలి మానవధర్మంబుగదా? మనకుఁగావలసినధనంబును, ఆశ్రితకోటియును, గో, భూ, హిరణ్య, సముదాయములతో గూడిన

యష్టైశ్వర్యములును గలవు. నీవుగూడ నొకగృహస్థుడవై పుత్రవంతు
లగుచుమనుటయే మా యభీష్టమని పరిపరివిధంబులఁ జెప్ప జననీజనకుల
కేమియుం జెప్పుటకు నోరాడక నిట్లు జెప్పందొడంగెను. జననీ జనకు
లారా "నాకింకను విద్యాభ్యాసము పూర్తి కాలేదు. ప్రస్తుతముతర్క-
మీమాంసాదిశారీరకశాస్త్రములఁ దెలిసికొనుచుంటిని. పిన్న వయ
స్సునందే వివాహమా? "వివాహోవిద్యనాశాయ" యనెడులోకో
క్తివినమే? తమకుఁ దెలియని ధర్మంబులు లేవు. స్వేచ్ఛాప్రపంచమున
యున్నతాశయాభివృద్ధికాటంకము. వివాహమొక సంసారబంధము.
అయినను స్త్రీలు చంచలమతులు తొల్లి విష్ణువు తన భార్య లక్ష్మిని తన
వక్షస్థలమందు నిలుపుకొనెను. శివుండు తనయర్థాంగియగు పార్వతిని తన
యర్ధశరీరిణిగాఁ జేసికొనియెను. బ్రహ్మదేవుని పత్ని సరస్వతిని తనవాక్కు
నందిడుకొనెను. సకలశాస్త్రపారంగతులగు, మహనీయులే యిట్లు
వర్తించుచుండిరి. శ్రీరామచంద్రుఁడు సీతం బొండ్లాడి యనేకములగు
నిడుమలం గుడిచె. నలుఁడు, హరిశ్చంద్రుఁడు, మున్నగువారు భార్యా
బిడ్డలను విడనాడి అరణ్యములందు సంచరించిరి. సప్తసముద్రంబులైన
నను నీదవచ్చునుగాని సంసారసాగరంబు నీదుట దుర్ఘటంబు. పూర్వ
పుయుగములందే స్త్రీలతో నిడుములనుభవింపలేక గృహస్థాశ్రమంబు
లనువిడనాడి సన్న్యాసాశ్రమంబులను స్వీకరించి, మహర్షులై తపోవనంబుల
కరగి భగవద్ధ్యానపరాయణులై తరించిన వారలనేకులుఁ గలరు. కలికాలం
బున నిఁక జెప్పవలెనా! తండ్రీ నిఁకకొంతకాలంబు నన్నిట్లు బ్రహ్మచర్యం
బున నుండనిండు. తరువాతఁ దమయిచ్ఛవచ్చినట్లు మెలంగువాడనని
సాదరంబునఁ జెప్ప పుత్రునిఁ గాంచి; కుమారా! నీవిట్లు యోగమతంబవ
లంబించి విరాగివలె నాకు ధర్మోపదేశంబులుగావింతువని కలనైనం
దలంపలేదు. విజయవంశమునందుద్భవించి, వశంబు నీమూలంబున
నిర్వంశంబునొందుకాలము సమీపించినట్లున్నది. మనరాజ్యంబికముందు
పరులయధీనమైపోవును. నేటితో ప్రజలకును, మనకును సంబంధము
తొలఁగిపోవును. తొల్లి భారతవంశంబంతరించిన సమయంబున వేద
వ్యాసమహర్షిసైతమును, అంబిక, అంబాలికలను, విశ్వస్తలం బరిగ్ర
హించి వారివలన సంతానంబుఁ బొంది కుటుంబమును నిలుపఁబెట్టి చం

ద్రివంశంబుద్ధరించెఁగదా? అట్టియెడ, నీవాగర్భశ్రీమంతుఁడవైననీకిట్టి
దురాగతంబుతగదు. మాకీగర్భశోకంబుపెట్టక తగినకన్యనుఁ బాణి
గ్రహణంబుచేసికొని, వంశోద్ధారకుండవై మనుము వెఱ్ఱివేదాంతము
లను కట్టిపెట్టుము. నీవలె నందఱును విరాగులైనచో ప్రపంచకంబెట్లు
వృద్ధిపొందును? "అపుత్రస్యగతిర్నాస్తి" యనెడు నార్యులపలుకులను
వినమే? గృహస్థాశ్రమంబు స్వీకరించి సంతానసౌఖ్యమనుభవించిన
తరువాత యిచ్చవచ్చిన యాశ్రమంబుస్వీకరించి భగతారాధనంబుచేసి
కొనుచు ముక్తిగాంచుటకర్తవ్యంబు గాన తగినకన్యం బెండ్లాడి పుత్రవం
తుండవై మనుమనుటయు, నంత విజయప్రసాదుం డేమియుం బలుక
నేరక, తమయాజ్ఞలకు మీరువాఁడనుగాను. ప్రకృతివైపరీత్యంబులం
జూడ మిగుల విసుగుఁజెంది నట్లుంటినిగాని సుగుణవతియగు కన్య నెట్లు
లభించునోయని నామనంబు తల్లడముందుచున్నదన, భూపాలుండిట్లనియె
నాయనా! "బుద్ధిఃకర్మానుసారిణీ" యనుట నెఱుంగవే? ఏదియెట్లు జరు
వలెనో నయ్యది జన్మమధ్యంబునఁ జెల్లక తీరదు. నీమనంబున నెంత
మాత్రమును సంకోశముఁజెందకమనుటయు, ప్రసాదుండట్లే యాలో
చించుచూ, నాకొక్కయుపాయంబు తోఁచెడిని శెలవైనచో విన్నవిం
చెదనన, భయంబువీడి వాక్రుచ్చుమని భూపాలుండువలుక, తండ్రీ
నాకొక్కనియమముఁగలదనియు, ఆనియమంబున కేరాజకన్య యంగీ
కరించునో యాకన్యం బెండ్లాడఁదలంచెనని బహిరంగపరచుడు. అదియు
నాయభీష్టంబన నీయుద్దేశ్యమును నాకెఱింగింపనిదెట్లుసమకూడునన
ప్రసాదుండిట్లని తండ్రితో చెప్పందొడంగె.

స్త్రీలకు స్వాతంత్ర్యంబు లేకుండఁజేసి పురుషులయాజ్ఞలకు వశ
వర్తులైయుండునట్లు పరీక్షార్థమై "నాచే మూఁడుపాదరక్షాప్రయోగం
బులను, ఏకన్యదినుటకంగీకరించునో" యట్టికన్యను బరిగ్రహించి మీ
యిచ్చవచ్చినట్లు వర్తించువాఁడ. నిదియే నావ్రతమని తనహృదయస్థి
తాభిప్రాయమును వెల్లడించెను. తండ్రివిని నాయనా! నీకోరిక నీహృ
దయమంగీకరింపవచ్చునుగాని, లోకులువిన్న నేమందురు? సంబంధమ
న్నపరిహాసింతురు. గాక యీరాజింతటి యవివేకియని యెల్లరును దూఱు
దురు.' లోకాపవాదంబు భరింపఁజాలను. దీనికేదైన యుపాయంబు

పన్నవలెను. అయినను నీయభీష్టంబు నెరవేర్ప ప్రయత్నించెదను. కొంత వరకు వివాహముచేసికొనుట కంగీకరింపేఁగదా! యని యనుకొనుచుండ నింతలో భోజనంబునకు జయధ్వానంబు వినఁబడిన నందరును లోనికరిగిరి.

## 2. కృతనిశ్చయము.

సూర్యభగవానుఁడస్తాద్రికేగుచుండెను. శుకపికశారికాది పక్షిగణంబులుశృంగారరసంబున హెచ్చరికతోఁ జేయు గలకలారావంబులు వీనులకు విందుఁజేయుచుండెను. మలయానిలుండుఁ చెలరేగి చల్లని మందమారుతమునిచ్చుచుండెను. బవలంతయును కష్టపడిపనిజేయు మానవ సంతతికి శ్రమదీర్చుకొనుటకోయన నదీతీరంబునకుఁ జల్లగాలికై సుకుమారులెల్లరును బయలుదేరుచుండిరి. పిన్నవయస్సుఁగల దంపతులిదే సమయంబని శుచిర్భూతులై తెల్లనివసనంబులంధరించుకొని విహారమునకై బయలుదేరుచుండిరి. పణ్యాంగనావాటికలందలి వేశ్యాంగనలు విటులను వశపరచుకొనుటకై, శృంగారముగా నలంకరించుకొని, ఆరామములందాసీనులై వీణెలుమీటుచు, వీనులకు విందుసేయుచు మానసంబులుఁపల్లవించునట్లు రాగంబులం బాడుచుండిరి. అట్టిసమయంబున విజయప్రసాదుఁడు వనవిహారంబునకై బయలుదేరెను.

అందందు కరస్పర్శ్యంబులనుఁ జేసికొను స్వేచ్ఛావిహారులగు స్త్రీపురుషుల యన్యోన్యప్రేమానుబంధంబులనుఁ జూచుచు, ఖర్జూర, ద్రాక్ష, మల్లికా, మాలతీ, నికుంజంబులమధ్య నొకవేదికయందాసీనుండై దనలోఁదానిట్లు తలపోసికొనుచుండె. ఇస్సీ వివాహమన్ననేమోయనుకొంటి; ఈకరస్పర్శ్యంబులంజూడ నాకును వికారంబు వొడముచుండె; అయ్యో; ఏమినాదురదృష్టము. నాతండ్రి నన్నేక విధంబుల వివాహముఁజేసికొనుమని నయంబునఁబయంబున నొడంబరచినను వెర్రినై సాకులంబన్నుచు, ముందెన్నడో చూతమని మిషఁబెట్టుచుంటిని. సద్వంశంబునందుదయించిన, నేరాజకన్యకయైనను పాదరక్షాప్రయోగంబులకొడంబడుసా! ఏమినావెట్టి నామనంబు వికారంబుజెందుచున్నయది. నామిత్రులకువలె వివాహంబాడి, నిట్టి యారామంబులందు విహరించుభాగ్యమెన్నఁటికి లభించునాయని నామనంబు

వ్రేళ్లూరుచున్నది. ప్రతినఁగలదని తండ్రిగారు ప్రకటించిరి. దానినట్లు యుపసంహరించుకొందును. ఆడినమాటఁదప్పుట క్షత్రియధర్మంబు గాదు. ఏదేశాధీశ్వరునికన్య, ఎట్టిసద్గుణసంపన్నలభ్యమగునోకదాయని పరిపరివిధంబులం దలపోసికొనుచు నారామంబువిడచి యంతిపురంబున కరిగెను.

ఒకనాటియుదయమున విజయపురాధీశ్వరుఁడు దర్బారు జేయుచుండెను. బాహ్లిక, యవనదేశములనుండి విజయప్రసాదునకుఁ దమతమ కన్యకలనిచ్చుటకుద్దేశించి వారివారి చిత్రపటంబులతో నాయారాజపురోహితులరుదెంచి, దర్బారునకు విచ్చేసిరి. వారివారికిందగినట్లు దర్బారునందాసీనులైరి. విజయభూపాలుండు వారినిఁజేరి క్షేమసమాచారంబులందెలసికొనెను. పురోహితుల యాగమనకారణంబడగెను. ఆపురోహితులు సంగతులు విన్నవించుకొనుచుతమ యేలికలచే పంపఁబడిన చిత్రపటంబులను రాజునకర్పించిరి. వానిని వెంటనే తనకుమారుండగు ప్రసాదునకనిపెను. ఇంతలో తత్పుత్రుని ప్రతిజ్ఞను పురోహితులకెఱింగించెను. ఆసమాచారంబువినుటతోడనే యీవింతసంగతిని మాఏలికకెఱింగింపగోరుచున్నారమని, విజయునియొద్ద సపర్యలంగొని తమతమదేశంబులకుఁ బయనమై వెడలిరి.

దర్బారునందు గుసగుసలు బయలుదేరెను. క్రమక్రమంబుగ పురమునందెల్లయెడలను రాజుయొక్క యవివేకత వెల్లడియయ్యెను. దేశదేశములంగల రాజులెల్లరకునుఁదెలసిపోయెను. ప్రసాదునకుఁబిల్లనిచ్చిన చెప్పుదెబ్బలెవ్వరుతిందురని విలాసార్థముగాననుకొనసాగిరి. ఇట్లు కొంతకాలముఁగడచిపోయెను. వివాహము క్రమముగా వెనుకఁబడెను. తల్లిదండ్రులవిచారము నానాటికి హెచ్చుగుచుండెను. గాని తమప్రయత్నమంతయును వృథాయగుచుండెను. నాయూరినందలి సంతర్పణములందును, వివాహములందును, సమారాధనలందును నిది యొక వింతసమాచారముగఁ బరిణమించెను.

ఇట్లీవింతసమాచారమును వినినవారెల్లరును తమకన్యకల నీయ నిరాకరించుచుండిరి. సంస్థానముయొక్క గొప్పతనమునుఁగూర్చియు, విజయునిపాలనమునుఁగూర్చియు గొందరురాజులు తమ కన్యలనీయ

నంగీకరించుచుండిరిగాని, తమతమకుమాత్రలీయక్రమకర విధానంబుల నొల్లమని ఖండితముగ నిరాకరింపుచుండిరి.

విజయభూపాలసంస్థానమునందలి ప్రజలయందును, సామంత రాణ్మండలియందును ప్రసాదునికి వివాహముగాకపోవుటచే నొకగొప్ప కళంకముగానుండెను. వచ్చినసంబంధములెల్లనుం దిరిగిపోవుచుండెను. ఎవరేమిచేయగలరు. "బుద్ధిః కర్మానుసారిణీ" యన్నట్లు పదునెనిమిది పరగణాలప్రభువైననేమి? ప్రయోజనమని యెల్లరునుం భావింపుచుండిరి.

విజయునకు మరింతవిచారము హెచ్చుచుండెను. ప్రసాదునకు వివాహముగాలేదని దినమొకయుగముగం గడపుచుండెను. ప్రసాదునింజేరి నాయనా! నీవిద్యావిశేషమీతీరుగనున్నది. సకలరాజబంధుకోటియందును నన్నొక యవివేకిగం భావించుచున్నారు. వచ్చిన సంబంధములెల్లను తిరిగిపోవుచుండెను. ఇందులకు కర్తవ్యమేమని బలికెను.

తండ్రీ! విచారింపకుండు. మనయాస్థానమునందలి దైవజ్ఞుండు నాకు గొప్పయింటిసంబంధము యీసంవత్సరములో వివాహమగు ననియు, సద్గుణవతియగు విద్యావతి వరించుననియు, ఆపెవలన మన వంశమభివృద్ధినొందుననియు, ఆసంబంధము మనసంస్థానమున కీశాన్య దిశయందగుననియుం జెప్పెను. యోగము కాలము కర్మము మంచివైన గాని యేదియునుం జేకూరదు.

తొల్లి గౌతమునిభార్య అహల్యాదేవి ఇంద్రునిచే మోసగింపం బడినప్పుడు గౌతమమహర్షి నిష్కారణముగ నహల్యను శిలగాశపించెను గౌతముండు విద్యావంతుండే! ఏమిప్రయోజనము? ఆపెకు కాలము సమీపించినది. నిష్కళంకహృదయగనుకనే సీతాన్వేషణమునకై యామార్గమునం దలువనితలంపుగ సంచరించు శ్రీరామచంద్రుని పాదధూళి సోకినంతమాత్రమున నాతియై శాపవిమోచనంబు నొందంగలిగె. జాతకఫలప్రభావంబు ననుభవింపకతీరదు. అంతమాత్రమునకై నిస్పృహం జెందరాదు. ప్రయత్నముచేయక నేకార్యమును సమకూరనేరదు. మూకీభావంబున నున్నంతకాలమును మనకీయప్రతిష్ట వీడిపోంజాలదు. మనయాస్థానపండితులనుం గొందఱిని యనుకూల ప్రదేశములకుం గన్యకల నన్వేషణార్థమై బంపవలెను. ఎవ్వరైననూ

పాదరక్షాప్రయోగసందర్భములం దలంపునకుఁదెచ్చిన నదియొక పెద్దసమస్యయనియు, నద్దానిని భేదింపఁగల విద్యావతి లభించునని, బ్రచార మొనర్చుచుంటిమనియుఁ జెప్పినంగాని మనకుఁగలిగిన యపవాదమునుఁ దొలంగించుకొనఁజాలమని చెప్పిన, సుతుని పలుకులకు సంతసించి నొకశుభముహూర్తంబున యిరుపురపండితులను కన్యాన్వేషణార్థమై పరదేశములకంప కృతనిశ్చయులైయుండె.

### 3 వివాహనిర్ణయము.

మఱుచటిదినంబున భూపాలుండు దర్బారుఁజేసెను. మంత్రిసామంతులెల్లరునుఁ గొలువుదీర్చియుండిరి. నాటిసభకు యువరాజు విజయప్రసాదుఁడుఁగూడ వచ్చియుండెను. ప్రైనజ్ఞపండిత దత్తకాచార్యులవారు, సభకు రానికారణంబును ప్రధానమంత్రి నడిగెను. వెంటనే వారికి వర్తమానముపంబడెను. ఇంతలో గృహసంబంధమగు భార్యాభర్తల వివాదమునుఁ పరిష్కరింపనెంచుటకుద్యుక్తులైరి. పురజనులీవివాదమునుఁజూడ సభకేతెంచిరి. లలితాంబను పిలువఁబడెను.

రాజు:—నీభర్తతో కాపురముచేయుటకు నీయభ్యంతరమేమి?

లలితాంబ:—మహారాజా! నాఅభ్యంతరమేమియును లేదుగాని అంతటి ధూర్తుఁడును, మూఢుడును జగతిపైనుండడు. నాతలిదండ్రులు నాగొంతుగోసిరి. యాతని కట్టుబాట్లు సహింపనేరక పుట్టినింటికడనుండవలసివచ్చెను.

రాజు:—అంతటి కఠినాత్ముడా? ఆతడొనరించిన దుర్మార్గములను కొన్నింటిని జెప్పుము?

లలి:—మనవిచేసికొందును. తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లని వాదించుయహంభావుఁడు. సద్ధర్మవర్తనులగు తమ్ములపై లేనిపోనియభూతకల్పనలుపన్ని దుర్వాదంతులునైచి కష్టపెట్టుచుండును. సంసారకృత్యములందు తనకన్న నెవ్వరికేమియుం దెలియదనియు, నన్ను నాపుట్టినింటివారినిందిట్టిపోయుచుండును. సమాధానముంజెప్పిన పాదరక్షాప్రయోగంబులు సిద్ధంబులు. పూజ్యులగు తల్లిదండ్రులను నోటవచింపరాని దుర్భాషలనాడుచు దినమొకయుగముగ గడపుచుండును.

కరత్రిపెత్తనముం జేయుచుండును. నాకు కట్టబట్టయు వేళకన్నమునుం బెట్టక హింసింపుచుండెను. తమబోటిప్రభువులుకాపాడవేడుచున్నాను.

భర్త-నారయ్య పిలువఁబడెను.

రాజు:—నీభార్యకును నీకును గలవివాదమేమి?

నారయ్య:—ఆయ్యా ఏమియును లేదు. నాఅత్తమామలు తక్కువ కులపుసంబంధులు. మధ్యాహ్న కీనివారు. నాతల్లిదండ్రులకు మంచిచెడుగులు తెలియక సంబంధము చేసినారు. నాభార్యను పంపుటగాని, పునస్సంధానముఁ జేయుటగాని, పెద్దలమూలముననే జరిగినది. నాటనుండియు ఇంటసేయుంచినది సంసారమంతయు గుల్లచేసి ఇంటగల సొమ్మునంతయు మిండగాండ్రకు వశముచేసినది. ఇట్టి కులభ్రష్టనాయింట నుంచతగదని నిశ్చయించి తిరుగ మరియొకభార్యను వివాహమాడితిని బాబూ.

రాజు:—అదియును గర్భిపాపను నేమిచేయుదువు?

నారయ్య:—బుద్ధిచెప్పకొని జాగరూకతతో కాపాడుకొనెదను

రాజు:— కాని యిప్పటిభార్యకులీనసంజాతయేనా?

నారయ్య:—ఆరువందలిచ్చి తెచ్చుకున్నది. సత్కులసంజాతలతో సంబంధబాంధవ్యములుగలది. ఆమె నీచసంభవ కాదు.

రాజు:—సరే నీపవిత్రత నీసాక్ష్యమువలననే ధృవపడినది. వేరే సాక్ష్యమక్కరలేదు. నీభార్యలలితాంబకు నెలకు ఆరుమాడల భరణమిచ్చుకొమ్ము పొమ్ము.

అని భూపాలుండు చెప్పినతోడనే నారయ్యప్రాణములులేక నిశ్చేష్టితుండై యుంటికేగెను. చేయునదిలేక కాయక్లేశములనుభవించుచుండెను. నింతలో పండితదత్తకాచార్యులవారు విచ్చేసిరి.

రాజు:—ఆచార్యా విజయప్రసాదుని వివాహప్రయత్నమునకై తాము పండితవిరలచ్ఛటోపాధ్యాయులవారునుకలసి పాంచాలదేశాధీశ్వరుండగు శ్రీఅనంత పద్మనాభభూపాలుని పుత్రిక నడుగుటకై పాంచాలమేగిరావలయును. ఆమె మిగుల విద్యావతియనియు, రూపవతియనియు వింటిమి. వారితోవియ్యంబాద యుక్తంబుగనుండును. పయనంబునకు శుభముహూర్తమాలోచింపుడని, రాజు దర్బారువిడచి

యంతిపురికరిగెను. అంత నాపండితులు ముహూర్తమాలోచింప సాగిరి.

పండితులపయనము పుష్యబహుళసప్తమీ కన్యాలగ్నంబున ముహూర్తము నిర్ణయింపఁబడెను. యథోచితమగు దుస్తులతో పండితులు రాజునొద్ద శెలవుఁగైకొని పాంచాలమునకుఁ బయలుదేరిరి. మార్గమధ్యమందున్న రత్నభాగపురమందలి బాటసారులసత్రమునందు బస చేసి భోజనసామగ్రిలను సేకరించి పచనమొనర్చుకొని భుజించిరి. వెంటనే గమ్యస్థానముఁజేరుటకు బండికై నెమకుచుండ మిగులబడలికగా, మార్గాయాసముంజెందుచు నిట్టూర్పువిడచుచూ వచ్చుచున్న నిరువురఘాందసులను సమీపించిరి. వారింజూడఁగనే విఠలచ్ఛటోపాధ్యాయులవారు ఆర్యా; తమ రేదేశవాసులు; తమపవిత్రనామంబు లెయ్యవియో వినఁగోరుచున్నామని ప్రశ్నించెను. మహామహులారా! మాదిపాంచాలము. శ్రీఅనంతపద్మనాభభూపాలుని యాస్థాన విద్వాంసులము. నాపేరు భానోజీ; వారిపేరు ఖండోజీ పండితులని బిలతురు.

విఠల:—పండితవర్యులారా! తామిటకుఁ రాగతంబేమి?

భానోజీ:—మహాశయులారా!! మా యేలికపంపున రాజకార్యార్థమై రాజపుత్రమునందలి విజయపురాధీశ్వరుని దర్శనార్థమరుగు చుంటిమి. మరచితిమి తమపవిత్రనామములు, యునికియు శెలవీయ గోరెదము.

విఠల:—ఓహో యటులనా ; ఆడబోయిన తీర్థమెదురైనట్లు మాదియు వేదవతీనగరమే? విజయపురాధీశ్వరునిచే పోషింపఁబడు యాస్థానపండితులము. నాపేరు విఠలచ్ఛటోపాధ్యాయులు, వారి నామము పండితదత్తకాచార్యులవారు. మారాజుపంపున మీయేలిక దర్శనార్థమరుగుచుంటిమి.

భానోజీ:—ఆరాజకార్యంబెద్దియో విని సంతోషింపవచ్చునా?

విఠల:—ఆ, అవస్యము వినఁదగినదియే? మాభూపాలునకు విజయప్రసాదుఁడనెడు నిరువదిరెండేండ్లప్రాయముగలసుతుండుగలఁడు. మీరాజునొద్ద సకలసద్గుణవతియగు విద్యావతియగు పదియారేడుల

ప్రియముగల కన్యకామణిగలదని వినియుంటిమి. అక్కన్యనడుగుటకే పోవుచుంటిమి.

భానోజీ:—నోహారో శుభస్యశీఘ్రంబవస్యంబు మేమును వరాన్వేషణంబునకై వేదవతిపోవుచుంటిమి. ఆసంబంధవిషయములనుమనమే సావధానముగ విచారింపవచ్చును. తరువాత నందరమునుఁగలసి పాంచాలమునకేగి సంబంధము స్థిరపరచుకొని తక్కిన కార్యములు జరుపుకొనుటకు వీలుండును గదా?

విశాల:—సరే మేముబసచేసినసత్రమునకుఁబోయి సావధానముగ సంభాషించుకొందము రండు. అనుటయు నల్వురును బసకేగి రత్నకంబళముపై నాసీనులై నిట్లు ప్రస్తాపించుకొనిరి.

దత్తకా:—ఆర్యా మీరాజగారి సందేశమేమి?

ఖండో:—పండితవర్యా విజయప్రసాదుని చిత్రఫలకమొందు మాయాస్థానమునకువచ్చె, వానిరూపరేఖావిలాసంబులకచ్చెరువందుచు దాని నంగీకరించెను. మీరాజునకు ప్రజలయందనురాగము మొండగుటచే దేశమునందలిరాజులలో మిగుల ధర్మజుండని ఖ్యాతిగాంచెను. అట్టివారితో వియ్యమంద గుతూహలముగలిగెను. గాని మీప్రసాదునకింతవరకు వివాహముచేయకుండుటకు గతంబెద్దియో శెలవిచ్చెదరా?

దత్తకా:—మరేమియునులేదు. ప్రసాదునకు తర్కమీమాంస శారీరకశాస్త్రములు పూర్తిగానిదే వివాహమాడుటకు నిచ్చగింపకుండె అందుచే యుపేక్షింపఁబడినది. మీనిర్ణయము వినవేడుకంబొడముచున్నది.

• ఖండో:—మానిర్ణయమునకేమున్నది. వారి వంశమర్యాదలననుసరించి అటునకైదుగ్రామంబులరణంబుగానిచ్చి రాజమర్యాదలను సక్రమంబుగ జరుపుటయే?

దత్తకా:—సంతోషము. వానికేమిగాని పెండ్లికుమరితెయిపుడేమి చదువుచున్నది? ఆపెపవిత్రనామ మెయ్యది?

ఖండో:—కాళిదాసత్రియముమాత్రమేపూర్తియైనది. ఆపెను ప్రభావతీయనిఁబిలతురు.

దత్తకా:—విద్యాగురులెవ్వరు?

ఖండో:—మాభానోజీపండితులవారే.

దత్తకా:—అటులైన పండితమహాశయా; మాదొక్క మనవి గలదు. సావధానముగనాలోచించి కార్యసాధనవిధానమునకుంగడంగ వలయు.

భానోజీ:—అయ్యది పెండ్లికుమారైవలననైనచో అవస్యము సమకూర్పఁబ్రయత్నించెదను శెలవిండు.

దత్తకా:—మాపరిసాదుఁడొక స్నేహితునకొక సమస్య ప్రసంగవశమున నిచ్చెను. దానినాతఁడు పూరింపలేకపోయెను. అంత నా పరిసాదుండు పకపకనవ్వుచు నోహోనిదియేనా? నీపాండిత్యము సాధారణముగా చదువుకొనినస్త్రీలిట్టి సమస్యలుపూర్తిచేయగలరని హేళనముఁగావించెనట. అంత నాస్నేహితుఁడు నీవువరింపఁబోవుకన్యక కా సమస్యనిచ్చి పూరింపుమనెను. అట్లామె పూరింపలేకున్న మూఁడు పాదరక్షాప్రయోగంబులందినుట కంగీకరించెడుకన్యనే పెండ్లాడుదువా యని పాదరంబునంబలుక; మిత్రమా; నీవన్నయట్లే యాసమస్య బూరింపలేకున్న పాదరక్షాప్రయోగంబులందిన సమ్మతించినకన్యనే వివాహమాడెదను. ముమ్మాటికిని నిశ్చయమని ప్రతినబట్టెను. ఆసమస్య భార్యాభర్తల యన్యోన్యాను ప్రేమానుబంధయుతమగునదిగాని బహిరంగపరచునదికాదట! గావున అట్టినిర్ణయమునకు మీకన్య నొడంబడతురా?

భానోజీ:—ఇదియేనా మీకోరిక యిది రాజువరకునుఁబోవ నక్కరలేదు. మారాజకన్య ప్రభావతియే నవలీలగఁబూరింపఁగలదు. బూరింపలేకున్న భర్తచే ప్రయోగంబులందినుట గులహీనమగు నమర్యాదగాదు. యీసంగతి మీరెవ్వరితోడను బ్రస్తాపింపనక్కరలేదు. తొల్లిరాముఁడు రజకునిమాటలకలరి లోకనిందఁబడజాలక నిండు గర్భవతియగు సీతనరణ్యంబునకనిపెను. తన నిష్కళంకహృదయము తేటపడునట్లు సీత నగ్నిగుండమునఁబడినగాని రాముఁడు పరిగ్రహింపలేదు. దానిలో నిదియెంతపని.

దత్తకా:—(అంతరంగమున మిగులసంతసింపుచు) అటులయిన మనమందరమును శ్రీఅనంత పద్మనాభమహారాజునొద్దకరిగి అచ్చటనే

వివాహముహూర్తము నిశ్చయించుకొని ముందుప్రయత్నములు జర
పుకొందమని ద్విచక్రినశ్వవాహనారూఢులై నల్వురును యారాత్రి
పండ్రెండుగంటలకే పాంచాలాంబునకు కరగిరి.

మరుచటిదినముదయముననే పండితులెల్లరును పాంచాలదే
శీశ్వరుని దర్బారునందాసీనులైరి. మరికొంతసేపటికి రాజు యాస్థా
మునకు విచ్చేసెను. సభాసదులెల్లరును నమస్కారములుసేయుచు నిలు
వంబడిరి. రాజు సింహాసనమధిష్ఠించెను. సభికులెల్లరును దమతమ
యాసనములందాసీనులైరి. రాజపుత్రి పండితులిరువురునుమాత్రమట్లే
నిలువంబడి శ్లోకపూర్వకముగ రాజునాశీర్వదింప ప్రారంభించిరి.
ప్రధాని వారింజూచి తమపవిత్రనామంబులు వినగోరుచున్నామనియెను.

అమాత్యశేఖరా! నాపేరు చిత్తకాచార్యులు నాసహపాఠి విశ
లచ్ఛలోపాధ్యాయులు. మాది వేదవతీనగరము నివాసస్థానము.
శ్రీవిజయపురాధీశ్వరుని యాస్థానపండితులము. అని చెప్పుటతోడనే
శ్రీఅనంతపద్మనాభభూపాలుడు సింహాసనమునుండిలేచి పండితులకడ
కుపాదచారియైవచ్చి కరస్పర్శనములంగావించి తన సింహాసనముప్రక్క
నాసీనులంగావించి క్షేమసమాచారంబులడుగుచు, ఖండోజీ, భానోజీ,
పండితుల సమావేశమునంతయునునివేదింప రాజు మిగుల నాశ్చర్య
మభినయించి, తమపండితులవలన సంబంధనిర్ణయమును పండితుల
యాగమనంబును విని సంతసించి తమపండితులనభినందించి, రాజపుత్రి
పండితులకుచితరీతి సపర్యలంగావింపనియోగించి, పండితులభోజనము
లయినవెంటనే తమ యంతిపురంబునకు రాననుజ్ఞయిచ్చి తానంతిపురి
కరిగెను.

పండితులును నిష్టాగోష్టితోమృష్టాన్నఫలరసంబులంగ్రోలి, తాం
బూలచర్వణంబుజేసికొనుచు రాజాంతఃపురంబునకుఁ బయనమైరి. పం
డితులరాకకై హాజారముకడనొక ప్రతీహారుని నియమించియుండెను.
పండితులు వచ్చుటతోడనే ప్రతీహారుఁడు సమాచారంబెరింగింప లోని
కరిగి వారిశెలవుగైకొని పండితులను లోపలకుఁదోడ్కొనిపోయెను.
చలువరాళ్లపైవింతవింతలగురంగులతోసమర్పఁబడిన లతావిశేషంబులం
జూచుచు నిలువుటద్దంబులతోనింపఁబడిన యొకహాలునందలి సోఫాలపై

నాసీనులైరి. రాజు వారి ననేకవిధంబులఁ బహూకరింపుచు వివాహ సంబంధవిషయములను సాంతంబుగా నడిగి తెలుసుకొని సుముహూర్తము నిశ్చయించుటకుఁ జాతకములం బరిశీలింపుచుండిరి.

నింతలో భానోజీపండితుఁడు రాజకన్యకచే నాహూయమానుఁడై ప్రభావతీచెంతకరిగెను. ప్రభావతియు తనపండితునిరాక కై సంతసింపుచు యుచితాసనంబునం గూర్చుండనియోగించి ప్రయాణ సమాచారములను సాంగముగఁ దెలుసుకొనెను. వరుని చిత్రఫలకంబును, విద్యాప్రసంగసందర్భములను నామెకెఱిఁగించెను. ఇట్టి సకలసద్గుణ సంపన్నుండే నాహృదయేశ్వరుఁడని లోలోపల సంతసింపుచు, దీనికే మైన వ్యత్యాసంబుఁగలుగనేరదు కదాయని పరిపరివిధంబులఁ బండితునిఁబ్రశ్నింపసాగెను. నేమియునురాదుగాని చదువుకున్నవరుండగుటచే ముందుగా నొక్కసమస్యయిచ్చునట; అయ్యది భార్యాభర్తల యన్యోన్యప్రేమానుబంధ విషయమట, ఇతరులకుఁజెప్పరాదట; అద్దానిని మీరు బూరింపనలెవట; పూరింవలేకున్నచో మూఁడుపాదరక్షాప్రయోగంబులందినుట కంగీకరింపవలెనట; అందులకు మీరుహృదయపూర్వకముగ నంగీకరించినట్లయిన సంబంధము తిరుగదనిఁజెప్పెను. మీమనోగతంబెఱుంగగోరెదనన, ప్రభావతి గురుసకిట్లనియె ఆర్యా! యోడినచో పరిహారమునుఁబొందుట సమంజసంబేకదా? దానికేమి యాటంకంబని తనభావమును వెల్లడించుచు ప్రసంగించెను.

పండితుండామాటలువిని ప్రభావతీ నీవేమియును సందేహింపకుము. తగినవరుఁడు లభించెను. ఇది నీపూర్వపుణ్యవిశేషము గాని సమస్యాపూరణవిషయముమాత్రము పరమరహస్యముగనుంచుకొనుము. ఈవార్త నీజననీజనకులకైనం జెప్పకుము. తక్కినవ్యవహారమంతయునుఁ జక్కపెట్టెదను. రాజుగారు జాతకంబులనుఁజూచి వివాహమునకు సుముహూర్తమునిశ్చయింపఁబడుచున్నది పోయివచ్చెదను.

నింతలో దంపతులకిరువురకును వ్యతీపాతంబులులేకుండ పంచకరహితమగు సుముహూర్తమును నిర్ణయించిరి. అద్దానిని భానోజీపండితులకుఁజూపిరి. యుక్తంబుగనున్నదనెను. లగ్నపత్రికనుఁగూడవ్రాసి రాజుగార్కి వినుపించిరి అందీలీరుననున్నది.

"శ్రీమన్మహారాజ రాజశేఖర బిరుదాంకిత శ్రీశ్రీ విజయపురాధీశ్వర పాదారవిందముల సన్నిధికి:—

శ్రీ పాంచాలదేశాధీశ్వరుండగు శ్రీఅనంతపద్మనాభుండు సవినయంబుగ నమస్కరించి వ్రాయు శుభలేఖార్థములు. స్వస్తిశ్రీ చాంద్రమానప్రభవసంవత్సర మాఘశుద్ధ పంచమీ సౌమ్యవాసరంబున హస్తానక్షత్రయుక్త కర్కాటకలగ్నంబున నాపుత్రిక చిరంజీవి సౌభాగ్యవతి ప్రభావతిని, ఆగిర్వాణీ మాతులగు చిరంజీవి విజయప్రసాదునకిచ్చి మద్గృహంబునఁ బాణిగ్రహణంబు సేయుటకు పెద్దలచే ననుజ్ఞాతుండనైతి. గాన ఏతత్శుభముహూర్తంబునకు తమసకుటుంబ రాజబంధుమిత్రపరివారసమేతంబుగా విచ్చేసి, పాణిగ్రహణంబు చేసికొని మదర్పిత సత్కారంబులం బరిగ్రహించి మమ్మానందింపఁ బ్రార్థించుచున్నాము. ఇవియే అనేక శుభలేఖార్థములు. మంగళ మహాత్ శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

ఇట్లు తమవిధేయుండు,

అనంతపద్మనాభుండు

పుష్యబహుళదశమీ శుక్రవారం పాంచాలము.

రాజు చేజదువఁబడి సంతకము చేసి, మెండిపత్రంబున నాల్గు కాశ్మీరథోవతులును, పండితులలంకరించు బనారసుశాలువులును తాంబూలఫలాదులతో పండితులను సత్కరించి లగ్నపత్రికను శ్రీవిజయభూపాల పండితవర్యులకిచ్చి యుచితసత్కారముల నొసంగి సాగనంపెను. వెంటనే పండితులు వేదవతికింబయనమొనర్ప సన్నాహంబుగావించిరి. నాటినుండియు పాంచాలంబున వివాహప్రయత్నములు రాత్రింబవళ్లు విరివిగ పనులు సాగించుకొనుచుండిరి.

పండితదత్తకాచార్యులవారును, విరలచ్ఛటోపాధ్యాయులవారును పండితభానోజీ, ఖండోజీపండితుల యాదరంబునకెంతయుం బహూకరించి వారివద్ద శెలవుఁగైకొని వేదవతికిం బయనమైరి. సంబంధము కుదిరినది లగ్నపత్రిక చేతనిడుకొనిరి వివాహముహూర్తము దగ్గరనున్నది. ఈసంతోషవార్తను రాజునకెరింగించవలెనన్న కుతూహలముతో తమశకటమును మరింత వేగముగఁ బరుగులెత్తించుటలో బండియిరుసు యొక్క శీలజారి చక్రమువీడి బండి గుభాలున నేలఁగూలెను. పాపమా!

బండివాఁడును క్రిందపడెను. గుఱ్ఱము బెదరి త్రాడు తెంచుకొనెను. పండితులు ఖంగారుపడి, అయ్యయ్యో యిదియేమి ప్రారబ్ధమని మొఱ్ఱలెత్తుచు నొకరిపై నొకరు క్రిందబడిరి గాని ప్రాణాపాయము రాలేదు తిరుగ మరికొంతసేపటికి బండి మరమ్మత్తు చేయఁబడినది. బండితోలుదారి పండితులతో బాబూ మనకొందర మనలనింతపని జేసినది. ఇఁక తొందరఁజేయకుఁడు అనిచెప్పుచు నాటిసాయంకాలమెనిమిది గంటలకే వేదవతీనగరమునుఁ జేరగలిగిరి.

రాజును పండితులయాగమునవృత్తాంతమునువిని సమాచారంబులను దెలిసికొనఁ దొట్రుపడుచుండెను. పండితుల నంతఃపురంబునకు రానియోగించెను. రాజు స్వయముగ హజారముకడ వేచియుండెను. పండితులు అంతఃపురద్వారంబు సమీపింపగనే లోనికిఁగొంపోయియుచితాసనంబులపైఁ గూర్చుండి కుశలంబులుఁ దెలిసికొనెను. పండితులు రత్నభాగపురమందలి సత్రమునం గాఁబడ జేసిన విధానమంతయును రాజుగారికిని వేదించిరి. శ్రీ అనంతపద్మనాభునిచే పంపబడినలగ్నపత్రికనుఁజదివి వినుపించి రాజునకర్పించిరి. రాజు మిగులసంతసించి తమ పండితులాచరించిన మహద్విషయమును స్మరించుకొనుచు వారికనేక బహుమానంబులచే సంతృప్తిఁజేసి పండితులు మార్గమధ్యంబునఁబడిన శ్రమకై విచారించి వారివారి నిజనివాసంబులకనిచెను.

నాటిరాత్రి రాజ్ఞీరాజశేఖరులా లగ్నపత్రికంజదివి చూచుకొని మహానందసాగరంబున నోలలాడి వివాహప్రయత్నసన్నాహంబుసేయుటకుందగిన ఏర్పాటులను నిర్ణయించుకొనుచుండిరి.

## పాణిగ్రహణము.

మాఘముప్రవేశించినది. వివాహప్రయత్నములు విరివిగా రేయింబవల్లు తెరపిలేక పురంబంతయును నలంకరింపుచుండిరి. క్షత్రియులందు రెండు తెగలుఁగలవు. మొదటిదిసూర్యవంశము, రెండవదిచంద్రవంశము అప్పటికాలమందు బ్రహ్మసంతతివారలగు సూర్యవంశీయులు అరుదుగ నుండిరి. చంద్రవంశపువారికిని సూర్యవంశపువారికిని సంబంధబాంధవ్యములులేవు విశేషభాగము ఋషివంశపుక్షత్రియులపాలన మభివృద్ధిలో నుండుటచే యుత్తమక్షత్రియుల సంబంధములులభించుట కష్టతరముగ

నుండెను. సూర్యవంశము వారిది ఇక్ష్వాకునిసంతతివారు. వారికి వేదములందలి గోత్రసూత్రములుండును. మనుబ్రహ్మవంశముయొక్క సప్తమకుమారుఁడైన వైవస్వత విశ్వార్కకు ఇక్ష్వాకుఁడుద్భవించెను. ఈ ఇక్ష్వాకునకు శతతనూజులుద్భవించిరి. అందు విజయ, ఉదండ, వికుక్షియనెడు ముగ్వురుసుతులు హిమాచల పర్వతమధ్యక్షోణి నేలుచుండ, అందొకరికి వికుక్షికి పురంజయుఁడు గలిగె, వానికి ఇంద్రబాహుఁడు, కాకుస్థుఁడు, ఇరువురు జన్మించిరి. కాకుస్థునకు పృథు జన్మించె, పృథృనకు విశ్వగంధుఁడు - విశ్వగంధునకు చంద్రుఁడు, క్రమంబున, వాయునాప్యుడు-నాభర్క బృహదాస్యుఁడు - కువలయాశుఁడు-ధుంధుమారుఁడు-పృథాస్యుఁడు - హర్మన్యుఁడు- నికుంభి-బర్హినాప్యుఁడు-గృతాశ్వుఁడు-సేనజిత్తు - పురుకుత్స్యుఁడు- మాంధాత-అంబరీషుఁడు-యువతనాప్యుఁడు-హారితుఁడు - పురుకుత్స్యుఁడు-త్రిధన్యుఁడు-త్రిబంధుఁడు-సరణ్యుఁడు-త్రిసంఘుఁడు - సత్యవ్రతుఁడు-త్రిశంఖుఁడు-హరిశ్చంద్రుఁడు-లోహితుఁడు-చంపకనామధేయుఁడు-సగరుఁడు - హాళవంతుఁడు-దిలీపుఁడు-భగీరథుఁడు - మూలకుఁడు - దశరథుఁడు-వైనవిష్ణు-విశ్వసహుఁషుఁడు-ఖట్వాంగుఁడు - దీర్ఘబాహుఁడు-రఘువు- బుధశ్రియుఁడు-అజుఁడు-దశరథుఁడు-దశరథునకు-శ్రీరామ-లక్ష్మణ-భరత-శత్రుఘ్నుఁడు - అను నలువురు పుత్రులుఁగలిగిరి. ఇట్లు వైవస్వతమను వంశము భాగవతమునందలి నవమ స్కంధమునందు వర్ణింపఁబడియున్నది. కలి ప్రవేశించుటతోడనే శ్రీరాములవారికి ఋషిగోత్రజులైన తపోధనుల గోత్రసూత్రములను క్షత్రియుల కారోపించి, ఇక్ష్వాకువంశమునకుఁ ధనుంజయగోత్రమనియు, సీతాదేవి వంశమగు జనకచక్రవర్తికి వశిష్ఠగోత్రమనియు, వర్తింపుచుండిరి. బ్రహ్మవంశపు క్షత్రియులందే సూర్య-చాళుక్య వంశములుద్భవించెను. ఇఁక నీవర్తమాన కాలముననున్న క్షత్రియులగోత్రసూత్రంబులను పాఠకలోకంబు తెలుసుకొనుటకై యిచట వివరింపఁబడెను.

"శ్రీమన్ మహాపరిచ్ఛేద వర్ణాటక-కోట - కాగిత- పాటవములు- వశిష్ఠ-కౌండిల్య-ధనుంజయ-కాస్య-పాస్య - గోత్రంబులు నతిశయిల్లు మహనీయచారిత్ర మహితవిక్రములైన వరపూసపాటి-సద్వాత్సవాయ-

కలిదిండి-దాట్ల-కాకర్లపూడి-ఉనిసి-పెన్మెత్స-ఏజర్ల-పేరి-చర్ల - పాకల పాటి-భూపతిరాజు-వలువర్తి - మంతిన-అల్లూరి-మందపాటి - గొట్టిము క్కల-సాగి-గోరింట-కొక్కెర్ల-చింతలపాటి-యాదంతులూరి- సాగిరా దద్వయ-జంపెన-జంపన-ముదునుండు-ముద్రుంగు-ములగపాటి -అడ్డాల అడ్డూరి-చేకూరి-చెఱుకూరి-చెఱుకువాడ-శోంద్రాజు-గంద్రాజు-జుజ్జూరి-మళ్లాజు-కొంతేటి-కత్తేటి-కొత్తపల్లి-మల్లపురాజు-కూనపురాజు-ఉప్ప లపాటి-పాతపాటి-గొడవర్తి - అబ్బురాడ్-గురదాల- కమ్మ......శకి నేటి-శంపాటి-లకుమురాజు...రుకూర్-యువ్వన-దిందుకూర్-మద్దాల .........మల-మందయా-ఏగిరాజు-దండు-సరి.........దలపల్లి - చెదవాడ-కోచూరు...............కొలనువాడ- రావిపాటి...... ...భూపతిరాజు-యువ్వూరి-ఏవ్వూరి.........గంటి- సామంతపూడి-కా.........ధేనువకొండ-ముమ్మెనరాజు-గోకరాజు-గగికిపాటియు-చండ-గండ్లా-ఏగేశిన-వాడపల్లియు-నున్న-వల్లమూరు - కుచ్చర్లపాటి యు-కొక్కెర్లపాటియు-ఏటుకూరి-యుగంబు-తోటకూర- తిరుమలరా జు-అద్దేపల్లి-కోనంత-గాధిరాజు-ధ్ధరధ్వజసూషి-పిన్నమరాజు-బుద్ధరాజు ద్ధర-దొమ్మిమ్మిడాల-చామర్తి-దహ్యాన-సహ్యానరాజు-అంగర-కణికి - పా ట్యాలమరాజు-కఠ్వేపల్లియు - నడిమిపల్లియు - వెలగలవేటియు - జోచి రాజును-పౌలుపు మిగుల - అష్టవింశతి తోత్తనాహ్వయములలర ధర ణిలోపల దాచంద్రతారకముగ - చంద్రగిరిరామ-శ్రీరామ చంద్రుడి పుడు పూర్ణకరుణానురక్తిచే బోగించుగాత !!

ఇట్టిబుషిగోత్రపు క్షత్రియులకును బ్రహ్మావంశపు క్షత్రియులకును, సంబంధములు కుదురక మిగుల శ్రమనొందుచుండిరి. పాంచాల భూపతియు, విజయపురాధీశ్వరుడును బ్రహ్మవంశమునకుఁజెందిన సూర్యవంశీయులుగనుకనే సంబంధమనుకూలమైనది. ఈవిషయములు వేదవతియందుగల రాజులకెల్లరకునుఁ దెలిసినవిషయములే ?

విజయప్రసాదునకు మాఘశుద్ధ విదియ యందే పంచశిఖలతో నుపనయనముఁజేయ నిర్ణయింపఁబడినది. రాజబంధువులెల్లరును విచ్చేయుచుండిరి. సకాలమునకే ముహూర్తముమించకుండ పురోహితులచే వడుగు పెండ్లికొమరునకును, రాజదంపతులకును మంగళస్నానంబు

లాచరింప సన్నాహములొనర్పబడినవి. రాజదంపతులు పెండ్లిపీట లలంకరించిరి. పురోహితునిచే విఘ్నేశ్వరపూజ పుణ్యాహవాచనములు వేదోక్తముగ స్వస్తిమంత్రములు నేకరువుపెట్టుచుండిరి. ఇట్లు ఉపనయనమంతయును పూర్తికాగా నాల్గుదినంబులును విధియుక్తముగ నెరవేర్పంబడెను. విజయభూపాలుండు రాజబంధువులతో షడ్రసోపేతములగు పిండివంటకంబులతో నాల్గుదినసంబులునుసహపంక్తియుక్తుడై భుజించుచుండెను. అంతకుమున్నే వివాహ ప్రయత్నములన్నియును పూర్తిగావింపంబడెను.

క్షత్రియులకు సాధారణముగ పెండ్లివారింటికి పెండ్లికొమరుండు వివాహమునకుం దరలిపోవు నాచారములేదు. క్షాత్రధర్మము ప్రధానముగనుక తమఖడ్గమును పాలకియందలంకరించి దానికే యుచితసత్కారములాచరించి వివాహమొనర్చు నాచారముగలదు. అట్టి విజయప్రసాదుని ఖడ్గము నలంకరించి ముత్యపుసరులపాలకియందమర్చి యందులకు వలయుసామగ్రులతోడను, రాజబంధువర్గంబులతోడను, భేరీ, మృదంగ, వీణాది మంగళతూర్యారవంబులతోడను, పాణిగ్రహణమహోత్సవమును నెరపుకొనుటకై రాజబంధువులెల్లరును పాంచాలమునకేగు సన్నాహంబులుసిద్ధపరుపంబడినవి. నాటిరేయి విజయపురమంతయును దేదీప్యమానములగు విద్యుద్దీపములచే నలంకరింపంబడినవి. సాయంకాల మూరుగంటలకు యూరేగింపుటుత్సవముం జేసికొని, భోజనావశిష్టములం దీర్చుకొని పాంచాలమునకుం బయలుదేరిరి. విజయపురినుండి పాంచాలమునకు ముప్పదియైదుమైళ్లదూరమేగవలయును రాత్రికాలమగుటచే రక్షకభటవర్గముతో నరుగవలసివచ్చెను. ఆనాటి ప్రయాణములు బహుకష్టము. దారిదోపుడులుమెండు. అందు నిర్జరప్రదేశములు-పల్లెలు-పట్టణములు-మధ్య నడవులునుం దాటి గమ్యస్థానముం జేరునప్పటికి బ్రొద్దుపొడచెను.

పెండ్లివారిరాకకై నిరీక్షించుచుండిన పాంచాలభూపతి వెంటనే మంగళతూర్యారవంబులతో పెండ్లివారి నెదురేగి యుచితమర్యాదలం గావించి, వారినిం దోడ్కొని పెండ్లికొమారుని ఖడ్గముగల పాలకిని వెంటనంటి ఎల్లరును వివాహమంటపమునకు సమీపించిరి. అందొక

చిత్రవస్తుప్రదర్శనశాలయందు విడదినమర్చిరి. తక్కుంగల రాజబంధువు లెల్లరకును, ఆ సమీపమునందే బసలకై వసతుల నేర్పాటుగావించి వారిసామానులనందందు ప్రవేశింపఁజేసిరి.

వివాహలగ్నము సమీపించినది. గ్రామమండలియంతయును పాద చారులై పూలతో నలంకరింపఁబడిన పాలకీ వెంటనంటి, మేళ, తాళ, మంగళతూర్యారవంబులతో నూరేగుచు వివాహమంటపంబు ప్రవే శించిరి. పురోహితులు మంత్రాక్షతలనిచ్చిరి. రాజబంధువులెల్లరును యుచితాసనంబులపై సమావిష్టులైరి. కన్యాప్రదాతలకుఁ బంగరు పళ్లె రంబులతో పట్టుపుట్టంబులాదిగాఁగల మర్యాదలను సక్రమంబుగ నెర వేర్చిరి. పురోహితులు మంత్రములేకరువుఁబెట్టుచుండిరి. ప్రభావతి నలంకరించి వివాహమంటపమున నమర్చిన తెరచాటునకుఁ దోడ్కొని వచ్చిరి. విజయప్రసాదుని ఖడ్గమునకే వివాహసంస్కారములుగావింపఁ బడినవి. పాంచాలభూపతి వారి వంశమర్యాదల గొప్పవన నల్లునకైదు గ్రామంబులరణంబుగా పురోహితులచే జదివించెను. నవరత్నఖచితమగు కిరీటంబును, విచిత్రములగు రత్నహారములను, జలతారు బుటానీతో చిత్రింపఁబడిన వస్తులును, అశ్వ, గజాందోళికలరణంబుగ నొసంగెను. వివాహమిట్లు పూర్తిగావింపఁబడి సౌభాగ్యవతులగు ప్రభావతి నెల్ల రును దీర్ఘసుమంగలీభవ యని ఆశీర్వదించిరి.

రాజబంధువులెల్లరును షడ్రసోపేతంబుగ సహపంక్తులై భుజిం చినవెనుక రాజులందరిని ప్రత్యేకముగ పాంచాలభూపతి కలిసికొను చు కరస్పర్శంబులచే బహూకరించి యవ్వారల కుచితసత్కారములా చరించి వారివారి నిజనివాసంబుల కనిపెను.

వెంటనే పెండ్లికుమార్తెయగు ప్రభావతిని యత్తవారింట కను పుసన్నాహములు గావింపఁబడెను క్షత్రియులందు పునస్సంధానము నత్తవారింట జరుపుకొను నాచారముగలదు. ఆమహోత్సవము నకు పాంచాలభూపతిచే గూతునకు సారెచీరలును, అల్లునకిచ్చు నర ణంబులును, దాస, దాసీజనంబులను, వెంటఁబెట్టుకొని ప్రభావతి వెం డిపాలకీయందు బయనమై యత్తవారింటికిఁ బయలుదేరెను. విజయపుర రాజబంధువులు తమతమ నివాసంబులకరగిరి.

నాటిరాత్రియంతయును మార్గము నిరపాయంబుగ నుండెను. మఱుచటిదినము జాముప్రొద్దెక్కు నప్పటికి వేదవతి పురము ప్రవేశించిరి. వెంటనే ప్రభావతిని గృహప్రవేశమహోత్సవమును నెరపిరి. నాటిదినము వేదవతీ యంతయును పిండివంటకములతో నెల్లరును భుజించి సంతోషసాగరంబున నీదులాడుచుండిరి.

ప్రభావతి యత్తవారింట కాలుపెట్టుటతోడనే యత్తమామలకు సవినయంబుగ నమస్కరించి తనకొరకై నిర్మించిన హజారమునందు బ్రవేశించినది. విద్యావతియగు కోడలి వినయాదియథాసత్కారంబుల కంతయు విజయపురదంపతులు సంతసించి మహదానంద భరితులైరి. నాటిరాత్రియే విజయప్రసాదునకును, ప్రభావతికిని పునస్సంధాన ముహూర్తము నిశ్చయింపఁబడినది.

### ౫. ప్రతిజ్ఞాభంగము.

సాయంకాలముగాఁజొచ్చెను. దీపయాలియును దేదీప్యమానంబులగు విద్యుద్దీపంబులచే నలరారుచుండెను. స్త్రీలెల్లరును యుత్సాహపూరితులై యలంకారములఁ జేయుచుండిరి. పౌరులు తమ ఏలిక ప్రతిజ్ఞ నెట్లు నెరవేర్చుకొనునోయను విషయమును నొకరితో నొకరుఁ జెప్పుకొనుచుండిరి. గర్భాదానపుఁగదిని వివిధజాతుల పుష్పములతోడను, సుగంధద్రవ్యశోభితంబులగు వస్తువులతోడను, శోభాయమానంబులగు నిలువుటద్దంబులతోడను, మిగులశృంగారంబుగ నలంకరింపఁ బడెను. ప్రభావతియు రతీదేవియో యనునట్లు నలంకరించుకొనెను. ఎనిమిదిగంటలకే సుముహూర్తము నిర్ణయింపఁబడెను. దంపతులిరువురిని పునస్సంధాన నిర్ణీతస్థలమునకుఁ దీసికొనిరాబడిరి. అందమర్పఁబడిన హంసతూలికాతల్పంబుపై నాసీనులంజేసి దంపతీయుక్త తాంబూలాదుల నిప్పించిరి. స్త్రీలు పవ్వళింపు పాటలనుఁ బాడుచు కస్తూరచందన తాంబూలాదులచే దంపతుల నలంకరింపఁజేసిరి. మంగళహారతు లొసంగిరి. పేరంటాండ్రందరును మొగమొగంబులం జూచుకొనుచు నేకాంత సంధానమునకై కవాటంబు బంధించి యొకరొకరుగా తమ తమ నివాసంబుల కరగిరి.

ఇట్లు కవాటంబు బంధించుటతోడనే ప్రభావతి పాన్పుపైనుండి లేచి లోపలిభాగమునందలి కవాటంబును బంధించి శయ్యాతలంబు చెంత మౌనముఁదాల్చి నిలువంబడి భర్తలాలనంబునకై నిరీక్షించు చుండె. ఇట్లెంత తడవు నిరీక్షించినను లాభంబు లేకుండె విద్యావతి యగు ప్రభావతి భర్త చెంతకరుగుచు, మనోహరా! మౌనముగ్రహించి మిన్నకుండుట భావ్యమా? యనుచుఁ గరస్పర్శనంబుఁగావించి యనురాగపూరిత లోచనయై యాలింగనంబొనర్చెను. అంత నావిజయ ప్రసాదుఁడు చిరునగవుతో నోహో! స్త్రీల సాహసంబు కొనియాడందగినదే? యని మందహాసాంచితుఁడై బలికెను. పతిభక్తియుక్త యగు ప్రభావతి పన్నీరుజల్లి సురటీవేయుచు, ఫలహారంబులను భర్త ముందిడి, వీణమీటుచు శృంగారంబుగ సుస్వనంబుతో పాడుచు వీనులకు విందుజేయుచు, గాలక్షేపము ముగిసినతోడనే భర్త స్వీకరింపగా మిగిలిన పదార్థములను తాను స్వీకరించెను. తరువాత మనోహరా యంచు చెంతఁజేరి తాము సమస్యల నిచ్చుటలో మిగుల ప్రవీణులని మాగురువర్యులాదేశించిరి. రసజ్ఞులగువారి సాహిత్య ప్రభావమును సమాస్వాదింపగోరుచున్నదానను. అనుటయుఁ ప్రసాదుఁడు తనలో మరచినదానినిఁ జ్ఞప్తికిందెచ్చుచున్నది. కానిమ్ము యుత్తమ క్షత్రియ వంశమునందుద్భవించి నాప్రతిజ్ఞను నెరవేర్చుకొనకపోయితినేని నన్నాచంద్రార్కము స్త్రీలోలుండందురుకదా యని నిశ్చయించుకొని తల పంకించుచు ప్రభావతితో నిట్లనెను.

ప్రసా—విద్యావతీ బాగుగాజ్ఞప్తికిందెచ్చితివి? "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" యనునట్లు విషయమును మరచి నీతో సల్లాపంబులాడుచుంటిని.

ప్రభా — అంతటి మహద్విషయమేమిఁగలదు?

ప్రసా—విద్యావతుల ప్రభావంబు పరీక్షింపనిదే పరిగ్రహించుట?

ప్రభా—నన్ను పరిగ్రహించుటఁగూడ నొక సమస్యయేనా?

ప్రసా—అవును?

ప్రభా—అదెట్లు?

ప్రసా—నీ వివాహనిర్ణయమునందే మాపండితులచే దెలుపఁబడెనుగదా ?

ప్రిభా—మీనిర్ణయము మీపండితులకుఁదెలిసిన నాకెట్లు దెలియును ?

ప్రిసా—నోహో ! మిగులచమత్కారివలెమాట్లాడుచుంటివే? మీ గురువుగారేమియుం జెప్పలేదుగాబోలు ?

ప్రభా—మరచితిని చదువుకొనిన భర్తయగుటచే ముందుగా నొకసమస్యనిచ్చుననియుఁ దానిం బూరింపవలెననియు అయ్యది భార్యాభర్తల యన్యోన్య ప్రేమానుబంధయుతమగుననియుం జెప్పె.

ప్రసా—అంతియేనా ? పాపము నీకేమియుం జెప్పలేదు కాబోలును ?

ప్రిభా—జెప్పుటకేమున్నది యోడినచో మూఢు పాదరక్షా ప్రియోగింబులరణంబుగా స్వీకరించుట కంగీకరించినచో సంబంధము స్థిరమని వచించె.

ప్రిసా—అట్లయిన నిదిగో ? పాదరక్ష ! ప్రయోగింపవచ్చునా?

ప్రిభా—తామిచ్చుసమస్యపూర్తిఁ గావింపకున్నచోగదా ?

ప్రిసా—పెండ్లాడుటయే సమస్య; ప్రయోగంబులేపూరణము

ప్రిభా—తనలో ఏమి? నాగురువెంతమోసగించెను కానిండు అనుచు నేదియో ఆలోచింపుచుండెను.

ప్రిసా—పాదరక్ష పైకెత్తి ప్రయోగింపవచ్చునా ?

ప్రిభా—పైకెత్తిన చేతినింబట్టుకొని, కట్టియాచారమెవ్వరికైనంగలదా ? నాకేసంభవించెనా ?

ప్రిసా—ప్రయోగసిద్ధిగానిది ప్రతిగ్రహింప ననకాశము లేదు?

ప్రిభా—అట్లయిన నావివాహమునకుఁ గర్తలెవరు ?

ప్రిసా—మాతండ్రిగారే ?

ప్రిభా—వివాహమున కగు ఖర్చులెవరుభరించిరి ?

ప్రసా—మాతండ్రిగారే ?

ప్రిభా—అటులైన కర్తలగు తండ్రిగారికేగాని మీకెట్లుహక్కు గలదు ?

ప్రసా—ఎందువలన ?

ప్రభా—మీస్వంత సంపాదనచే నన్ను వివాహమాడలేదు గనుక ?

ప్రసా—వివాహమాడినది నేనేగదా ? నాప్రతినదీరుటెట్లు ?

ప్రభా—పునరుక్తియెందులకు? మొదటనే జెప్పితిని? ప్రేమానుబంధముచే వివాహమాడితిరిగాని, మీప్రయోజకత్వముచే గాదు ? అందుచే మీ ప్రతిన నెరవేర్చుకొనుట ధర్మవిరుద్ధము ?

ప్రసా—అటులైన నేమందువు ?

ప్రభా—భర్తచే మూఁడుగాదు— ముప్పదిప్రయోగంబులను దిన్నను విధాయకము నా వివాహమునకైన ధనమును మీరు సంపాదించుకొని మీ ప్రతిన నెరవేర్చుకొనుట సమంజసము.

ప్రసా—అట్లే సంపాదించి ప్రయోగించెద ? ననుచు పాదరక్షను యథాస్థానముననుంచి కవాటంబుచెంత కరుగుచుండెను.

అంత నా ప్రభావతి వెంటనంటి వెడలుచుంటివేమని హస్తమునుఁబట్టుకొనఁబోవుచుండ విదలించుకొనుచు, నిన్ను పరిగ్రహించుటకు ముందుగా నీసమస్య పూర్తిగావలెనుగదా ? యనుచు చివాలున హాజారమునుదాటి ప్రతిజ్ఞాభంగమైనదని లోలోనఁ గుందుచు కర్తవ్యమాలోచింపుచు తనగదియందు ప్రవేశించెను.

ప్రభావతి ఏమియుం బలుకనేరక, చేయునదిలేక తనలోఁదానిట్లు తలపోసికొనుచుండెను. అయ్యో ! ఇంతటి యవివేకపు సంబంధమెట్లు నాతండ్రి యంగీకరించెను ? అంగీకరించెబో నాగురువెట్టిమోసమొనర్చెను ? ఇదియేటిప్రతిన ? "దూరస్థాః పర్వతారమ్యాః సమీపాశ్చతు బర్బరాః" అనునట్లు గొప్పతనమునుఁజూచి వరించుటకన్న హేయమింకొకటిలేదు విద్యావంతుఁడయిననేమి ? సుగుణవంతములేని విద్య ప్రకాశించునా ? స్త్రీల నింతచులకనజేయుట కేకాబోలును ? నౌత్రమునకుఁ బుట్టినిల్లయి యుండెడు భారతదేశమెట్టిస్థితికివచ్చినది ? స్త్రీలకు స్వాతంత్ర్యములేకుండగను, విద్యావిహీనులుగఁజేయుటంబట్టియె తోడిదేశజుల సౌభాగ్యమనుభవింపఁజాలకుండిరి ? భారతీయులు స్త్రీలను గౌరవింపక తమకై సృజించిన పరికరములవలె న్యాయా

న్యాయవిచక్షణలేక, నుపయోగించుకొనుచున్నారు అన్నా! దేశమున కెట్టినిర్ణయకాలము సమీపించినది? నాయదృష్ట మీరీతిగనున్న తక్కినస్త్రీలమాట నికవేఱుగ భాషింపవలెనా? యనుచుం దలపోసి కొనుచు విచారించిన నేమిఫలంబని నిదురింపసాగెను. గాని నిద్రవచ్చు టెట్లు? తెల్లవారిన నెనరినలకు నెట్టియపవాదమునచ్చునోయని దిగు లొందుచు, భర్తచే దిరస్కృతనై కన్నీలకు వగచుచు శయ్యపై నొఱగెను.

ప్రసాదుండిల్లు చేరి తనగదియందు ప్రవేశించి, అయ్యో నెంతటి యవమానమునుం బొందితిని విద్యావతియగు భార్యను గోరుకొని యత్ర తిప్పంబొందితిని సోమరివలె నింటనుండి తండ్రిచేభరణమొందుచు నా జీవితముంగూర్చి నేనేసిగ్గుపడుచుంటిని తండ్రిగారి ధనముచే వివాహ మాడి ప్రతిన నెరవేర్చుకొనుట తగదిపనియని బుద్ధిచెప్పినది. ఇంక నేమిగత్యంతరమని విచారింపుచు నిదురింపసాగెను.

తెల్లవారినది ఎవరిగదులయందు వారుండిరి. ఇదియేమివింత యని కోటయందలి వారెల్లరునుం గుజగుజలాడుకొనుచుండిరి. యువ రాజునుగాని, కోడలినిగాని, నిదియేమని యడుగుటకు సాహసించిన నేమిగేడుమూడునోయని మిన్నకుండిరి. ప్రభావతి చెలికత్తెలుమాత్రి ము గదిని పరీక్షించి, నెట్టమర్చినవాములనే యుండుటచే నాశయించు కొని, చెలియా? రాత్రివిశేషములు మాకేమియుం జెప్పవాయని చిరునగవుతోం బరిహాసింపసాగిరి అంత నాప్రభావతి నాయనుమూన మునకుం దగినయట్లే పరిహాసింప ప్రారంభించిరిగదా! యని మనోగ తంబునం దలంచుకొని, సంతోషమభినయించుచు, అక్కా చెప్పుటకే మున్నవి? ఎల్లరకుం దెలిసిన విషయములే? నూతనాంశములేమి యుండును?

చెలి—అక్కా గదిలోనిసంగతులందరికెట్లు తెలియును?

ప్రభా—అనుభవజ్ఞులకేయని నాభావము సంతలో మరియొక ప్రస్తావనలోనికిందింపి యథాప్రకారము వారితోనాటపాటలం బాడు చుం బొద్దుపుచ్చుచుండెను.

విజయప్రసాదుండు యథాప్రకారము ప్రాతఃకాలముననే లేచి

కాలోచితకృత్యంబులనుఁదీర్చుకొని, పనిగలిగినట్లు దర్బారునకేగి దివా ణపుషరాబునుఁబిలిచి, నాల్గువేలరూప్యములు నాపేరఖర్చువ్రాసితెం డని నియోగించెను పిధానితోమాత్రిమునాకు కొన్ని రాజకార్యపు తొందరలుగలవనియు నాకొరకై మీరేమియుఁ వెదుకనవసరములేదని మాత్రిముఁ జెప్పెను నింతలో సొమ్మునంతయును ప్రిసాదునియొద్దకు షరాబుచే పంపఁబడెను.

ప్రిసాదుఁడు తనకుఁగావలసిన దుస్తులను, సొమ్మునుఁదీసికొని వడిగల నశ్వముపై నధివసించి ఎవ్వరితోడం జెప్పకుండ తమ పరిసర ప్రాంతదేశమునువిడచి యొక పెద్ద రాజబాటంబట్టి బోవుచుండెను.

వి దే శ గ మ న ము.

మధ్యాహ్నముగాఁజొచ్చెను. యువరాజుగారి ప్రియాణమును గుఱించి కోటయందలివారు గుజగుజలాడుకొనుచుండిరి. భోజనమునకు వేళయయ్యెను మహారాజునకుఁగూడ నీసమాచారముఁదెలిసెను. వెం టనే మంత్రినిం బిలువనంపి ప్రిసాదుని యుదంతమునుగూర్చి తెలియు నాయని ప్రశ్నించెను. స్వకీయములగు రాజకార్యపుతొందరలుగలవని యు, హాజారమునుండి నాల్గువేలరూప్యములందీసికొని యశ్వవాహనా రూఢులై జనుచు నాకై మీరు వెదుకవలదనియుఁ దిరుగ త్వరలోనే వచ్చెదననియు, నాతల్లిదండ్రులకీసమాచారమునుఁ దెలుపుడని నాతో జెప్పి వెడలిరని ప్రిత్యుత్తరమిచ్చెను.

ఈవార్త ప్రిభావతికిఁగూడ దెలిసెను నేనకుకొనినట్లే గేఁడు మూడిఁనదని దిగులొందుచుండెను. ప్రభావతి మనోవిచారముతోఁడనే నిత్యకృత్యంబులనుదీర్చుకొనుచు చెలికత్తెలతో నాటపాటలం గడపు కొనుచుండెను. తల్లి గుణవతియు, మహారాజును విచారసాగరమున నుండిరి.

ఇట్లు విజయప్రిసాదుఁడు మధ్యాహ్నమగుసరికొక గ్రామముఁ జేరెను. అందొక బాటసారుల సత్రమునందు విడిదిచేసెను. సత్రపు యజమానిచే భోజనసదుపాయములు నిర్వర్తించుకొనెను. తిరుగ సాయంకాలమునకొక పట్టణముఁజేరెను. అందొక పేదరాసిపెద్దమ్మ యను నొక ముసలియింటఁ బసచేసెను. ఆమె చిరకాలమునుండి

పూటకూళ్లయిందారి తేరినయువతి. ఎవరికెట్టి యుపచారములం జేయువ లెనో ఆమెకు అనుభవముమెండు. యువరాజనేటచే తనయశ్వమును గాయుటకొక పరిచారికను నియమించెను. తన భోజనమునకై దినమున కొకవరహా చొప్పున నిచ్చుటకు నేర్పాటు జేసికొనెను.

తననిత్యకృత్యములకై మరికొందరి నౌకరులను నియమించెను అందు తనకు క్షురకర్మకు ప్రత్యేకముగ నాయీని నియమించెను. రాజు మొదటనే నాయీని సంతోషింపజేసెదనని. నాయిమొదట కొలు వుండుమని చెప్పెను. నాతనిపనితన మొకపర్యాయము పరీక్షింపనెంచెను. యువరాజునొడలుపట్టి క్షురకర్మ చేసెను. రాజాతని పనితనమునకు మిగుల సంతోషించి నాలుగువరహాలివ్వబోయెను. అంత నాయీ మిగుల సందేహించి మీవంటిమహారాజులిట్లు చిన్నచూపుజూచుట న్యాయముగాదనెను. తిరుగ పదివరహాలివ్వబోయెను. బాబూ! తాము నన్ను సంతోషింపజేసెదనని మోసగించినారు. తమదయగాని నేనేమియును జెప్పుకొనుటకు నోరాడకున్నదని యూరకుండెను. రాజు వానిని సంతోషింపజేసెదనని చెప్పుటచే మరి యిరువదివరహాలిచ్చి యిప్పుడైన సంతోషింతువా? యనెను. బాబూ! ఇది సంతోషించుటకుడగిన బహుమానముగాదని, నాయీ చెప్పెను. రాజు తనలో నోహో! యీతడెంత మిగుల ధనాతురుడవలెనున్నాడు? కాని; ఒకేపర్యాయము నూరువరహాలిచ్చిన నేమనునోయని వెంటనే నూరువరహాలిచ్చి సంతోషింతువా? యని రాజడిగెను. అయ్యా! నేనేమిచెప్పగలను? మహారాజుల యనుగ్రహము మాయదృష్టమనిఁ జెప్పగా విని రాజు మరినూరువరహాలిచ్చిన తన్ను మంచివాడని సంతోషించునేమోయని తానాగ్రహమును కొత్తగావచ్చుటచే ఎట్లయిన వాని మెప్పింపదలంచి, వాని బారినుండి తప్పింపజూచుకొనుచుండెను. నాయితో నేను మొదట నిన్ను సంతోషింపజేసెదనని వాగ్దానమొనర్చితిని నిన్ను సంతోషింపజేసినగాని నామనంబు తృప్తినందజాలదు. ఇదిగో! మరిరెండువందలు కలిపి నాల్గువందలిచ్చెను. అంత నాయీ బాబూ! సంతోషమునకు విలువలేదు తాము సంతోషింపుమన్న సంతోషించెదను. అన రాజు సందేహించి మఱిరెండువం

దలిచ్చి సంతోషమా! యనెను? ఒక్క క్షురకర్మకై ఒక్కసారి కారు వందలయ్యెను. అంత నాయంబట్టుఁడు మిగుల సంతోషముతో బాబూ! సంతోషించితిని మీవంటి యుదారచరితులు లోకమునందుండబట్టియే దానధర్మములు ఖిలముగాకుండెను మీవంటి మహారాజుల యాదరమునే సదా గోరుకొనుచున్నవాఁడనని సెలవుఁదీసికొని వెడలిపోయెను ఇటులనే తాననుకొన్న దానికన్న మిన్నగను రొక్కమంతయునుఁ బెక్కు కారణంబులచే రెండు నెలలకుసరికే తనయొద్దగల సొమ్మంతయును నష్టయ్యెను.

ఇఁక రాజునొద్ద ధనము లేదు నిత్యకృత్యములు జరుగుట కాటంకమయ్యెను. తానెట్లు జీవితమును గడుపవలెనో యని నాఁడంతయును దీనత్వముతో నుండెను. పరిచారకులు భోజనమునకు లెండని పిలువ లేవఁడయ్యెను. మఱికొంతసేపటికి యాపేదరాసిపెద్దమ్మయే స్వయముగ భోజనమునకుఁ బిలువవచ్చెను. అంత నాపెద్దమ్మరాజువైఖరినిం జూచి నాయనా? ఇట్లు విచారహృదయుండవై యుండినట్లు తోచెడెని? తమకేమిలోపముఁ జేయుచుంటిని నావలననేమి యవమానము సంభవించినది. నేజేయు యుపచారములందేమైన యపసవ్యముఁ జరిగినదో యేలినవారు సెలవీయక తప్పదని పరిపరివిధములఁ దీనత్వముతో నడుగసాగెను. అవ్వా? నీవు నన్ను సకలవిధములను నాయింటనుండునట్లుపచారములఁ జేయుచుండఁగ నీయెడల నాకేమియుఁ గోపము లేదు. నావద్దనున్న సొమ్మంతయును నేటితో సెలవయ్యెను. మరల రేపటివారములో నాకు సొమ్మురాఁగలదు అంతవరకును ఎట్లుగడపుకొందునోయని విచారించుచున్నాను గాని వేఱేమియును లేదనెను అంత నాపేదరాసిపెద్దమ్మ రాజుసొమ్ము విశేషముగ ననుభవించుటచే నాయనా? నీవట్లు విచారింపవలదు యేమైన సొమ్ముకావలసినచో నాతో జెప్పిన లేదందునా? మీకేమియునుఁ గొరంత లేదు తమకెంతధనము కావలసినఁ దీసికొనుఁడు? లెండు! భోజనమునకుఁ బ్రొద్దుపోయినది అని యువరాజును దేవతార్చనకుఁ దీసికొనిపోయెను నాటనుండియును తనకుఁ గావలసిన రొక్కమును పెద్దమ్మవద్ద తీసికొనుచుండెను ఇట్లు రెండువారములు గడచెను ఇంకను సొమ్మువచ్చు మార్గములేకుండెను.

## మూషు చెప్పుదెబ్బల కథ.

మఱియొక వారముఁగడచెను ధనము రాదయ్యెను పెద్దమ్మకు రెండువేలియ్యవలెను. ఎక్కడనుండి ఎట్లు ధనమువచ్చును? అనుదినమును దత్తరపడుచుండెను వెంటనే శిరస్సునవలంభించుచుండెను. పెద్దమ్మకు తనసొమ్ము రాదనిభయముపడసాగెను. అయ్యా! మీరు యిచ్చువచ్చినట్లు నాసొమ్ముఖర్చుపరచుటయేగాని తిరిగి యివ్వదలచినను మీకు వచ్చుటంగానను నేడు నాసొమ్ము సంతయును యివ్వవలెనని తొందరఁజేయసాగెను. అంత యునరాజునకేమియును దోచుటలేదు అవ్వా! మా యింటినప్పనుంచి సొమ్మురాలేదు నేనేమిచేయుగలను నన్నువ్వారికైనను విక్రయించి నీసొమ్ము తీర్చుకొనుము అటియగాని కొన్నాళ్ళుగా నన్ను రవ్వ చేయకుమని బ్రతిమాలుకొనెను అయ్యా! మిమ్ములనుగాచినందులకు నాకు మంచియుపాయము చెలవిచ్చిరి. బాగుగానున్నది సరే మీయిష్టము చొప్పుననే వర్తించెదను అనుచు నాయిల్లరికాడికి బేరముఁజూపించుచుండెను. ఆగ్రామమునందొక తేలియుండెను. ఆతనికి మనిషి మిక్కిలి యవసరము అందుచే నాతండారాజును బానిసక్రింద రెండువేలిచ్చి తన గానుగపై బానిసగనుండుటకుఁ గొనిపోయెను. ఎవరేమిచేయగలరు? విధితప్పునుగదా? ఇట్లు రాజు బానిసగ నమ్మవడి యా తేలియింట గానుగ వానికుపచారములుఁజేయుచు తన యజమాని

ఇట్లు కొంతకాలముఁగడచెను ఒకనాటిరాత్రి శోకమనస్సునందు దుఃఖముఁబట్టఁజాలక తనలో తానిట్లు విచారింపసాగెను. "ఏమి నాపూర్వజన్మకృతము మహారాజునింటఁబుట్టి యుత్తమ కులక్షత్రియుఁడనై మహారాజభోగంబు లనుభవించుచు నేడిట్టి నీచవృత్తి నవలంబింపవలసివచ్చెను? దీనరక్షకా!! అన్నముఁబున్నమెఱుఁగని క్షత్రియాంగనను పాదరక్షాప్రయోగంబులు దినుమని నిర్బంధించిన కతనగదా? నాకిట్టి దుర్దశప్రాప్తించె ఆపె యెంతటిశీలవతియో! ఎంతటికోమలహృదయయో! నావెఱ్ఱియనుమానముచే లేనిపోని పరిభవ యను మిషఁజెప్పి తుదకు నాప్రియాంగనయగు ప్రేమావతిని బాసి యహంభావపూరితుఁడనై నేడిట్టి తెలుకులివానిసేవఁజేయుట తటస్థించినది దైవమా! యిక నాపాపములు మన్నించి నాకు సద్బుద్ధినిచ్చి నన్నుద్ధరింపుము

జగన్నాటకా! నన్నీ చెఱనుండి దప్పించు నుపాయమునుఁ గల్పింపుము నిత్యసత్యవ్రతుండగు విజయభూపాలవంశసంభవున కెట్టియవస్థ సంభవించెనే యని తలపోసికొనుచు" యుదయముననే లేచి నిత్యకృత్యములం దీర్చుకొని జాబొకదానిని తండ్రిగారికి వ్రాయ సంకల్పించెను. మామూలుగా తనయజమానిచే నియమింపఁబడిన పనులు నెరవేర్చి గానుగపై నూనెయాడుచు విశ్రాంతిగలుఁగుసప్పుడెల్లను తండ్రిగారికొక లేఖనువ్రాసి నొక పరిచారకునికిచ్చి వేదవతీనగరమున కంపెను.

పరిచారకుఁడా జాబునుఁ దీనికొని వేదవతిఁబ్రవేశించి విజయభూపాలున కందజేసెను. పుత్రవియోగముచే కృశించియున్న తండ్రి కుమారుని క్షేమములు తెలియని సందిగ్ధసమయమునందు జాబుచేరిన తోడనే యుత్సాహపూరితుఁడై జాబువిప్పి చదువసాగెను "శ్రీమత్ మహారాజ విజయభూపాల మహారాజుగారి సన్నిధానమునకు మీ ప్రియపుత్రుఁడు విజయప్రసాదుఁడు కాలత్రయమునేకవందనశతంబులర్పించి వ్రాయు శుభవర్తమానములు నేను భోపాలరాజ్యమునందు సుఖముగఁ గాలక్షేపముఁ జేయుచున్నాను. కొన్ని రాజకార్యముల తొందరలచే యింతవరకును మీకు నాక్షేమములు తెలుపఁజాలనందులకు మన్నింపుఁడు త్వరలో నాపని పూర్తి జేసుకొని మనదేశమునకు రాగలను. ఈజాబుచూచినతోడనే మరినాల్గువేలరూప్యములు పంపవలెను. మన్నింపుఁడు.

| | |
|---|---|
| వైశాఖశుద్ధ | ఇట్లు మీ ప్రియపుత్రుఁడు |
| దశమీ | విజయప్రసాదుఁడు |
| స్థిరవారము. | భోపాలనగరము. |

ఈజాబును చూచుటతోడనే మహారాజు మిగుల యానందించెను. ఆజాబును మంత్రికిచ్చెను. మంత్రులాజాబునుచూచి మనప్రసాదుఁడు భోపాలనగరమునందేదో యొక గొప్పకార్యమును పూనుకొని వెడలెను. గాన తప్పక వెంటనే సొమ్ముపంపుట కర్తవ్యమని నిర్ణయించిరి ఆజాబును ప్రభావతికిఁ బంపిరి. అద్దానిని ప్రభావతి తీసికొని జాబును సాంగముగ వీక్షించెను. జాబునుచూచుటతోడనే కాగితము నూనెమరకలగుటంగాంచెను. యామె కొకవిధమగు విచారమును

హార్షమునుగలిగెను. ఇందు చాల మోసముగలదు. నాప్రాణనాథుం డగు విజయపురిసామంతు గొప్పయుపద్రవమునందు జిక్కుకొని దానిని దప్పించుకొనుటకై పామ్మునకొంతైన జాబునాలిసి పంపెను. గాని విజ యభూపాలుండును, మంత్రులును దలంచిన నగాదని నిశ్చయించు కొనెను. గాని తనకుంగల యనుమానమునుమాత్రము నెవ్వరికిం జెప్ప కుండ తానా లేఖను భద్రపఱచెను. అమ్మాముకులకుందెలియకుండ తాను మాఱువేషమునం బోయి నాథుం దెలుసుకొనవలెనని నిశ్చయించు కొనెను. అమ్మామగలతో తన పుట్టినింటికింబోయి కొన్నిదినములుండి తలిదండ్రులం జూచివచ్చెదనని సెలవుగైకొని పుట్టినింటికిం బయనమై వెడలెను. అత్తమామలు గోడలిని దీవించి పంపిరి. తనకొడుకును గోడ లును యింటలేకుండుటచే దినమొక యుగంబుగం గడుపసాగిరి.

## మాఱు వేషము.

ఇట్లు ప్రభావతి తన పరిచారికలసముదాయముతో విజయపురమును వీడి సురక్షితముగ పాంచాలమునకేగెను. ప్రియకుమారి రాకకై పాం చాలభూపతియును గుణవంతురాలగు నతని భార్యయును పుత్రికను ప్రేమతో యాశీ ర్వదించి గోటలోనికిం దోడ్కొనిపోయెను. అటు నాలుగుదినంబులిట్లా గోష్ఠితో గ్రమింపుచు తాను వచ్చినకార్యమును తండ్రిగారితో జెప్పెను. పాంచాలభూపతి మిగుల విచారించి ప్రభావతికిం దోడ్పడి కోరిన ధనంబును, గుఱ్ఱములు మున్నగు పరివారములొసంగెను రాజ పుత్రి ప్రయాణోన్ముఖురాలయ్యెను. ఒక వేకువజామందు రాజకుమా రునివలె తన వేషమును మార్చి చక్కని గుఱ్ఱమును, తినుబండసంబా రములు మున్నగు పరికరంబులను సవరించుకొని జీనుపై గూర్చొని నతివేగంబున భోపాలనగర ప్రాంతమునకుం దన యశ్వమునుందోలుకొని పోవుచుండెను.

ఇట్లు కొంతదూరమేగుసరికి మధ్యాహ్నమయ్యెను. అందొక వటవృక్షముక్రింద తనగుఱ్ఱమును ఆపి భోజనాదికృత్యములు నిర్వర్తిం చుకొని తిరుగ గుఱ్ఱము నెక్కి ప్రయాణముసాగించెను. ఇట్లు యిరువది యామడలదూరమేగుసరికి తానెక్కినగుఱ్ఱము అలసిపోవుటనుగ్రహిం చెను. అందొక పల్లెబయట నొకచెట్టుక్రిందగుఱ్ఱమునుకట్టి "దానాను"

వేసి తానాగ్రామమునుం జూడనేగెను.

అందలి జనులొకగుంపుగా జేరి తగవులాడుకొనుచుండిరి. మాఱు వేషంబుననున్న ప్రభావతీయనెడు ప్రద్యుమ్నునిఁజూచి మహారాజా! మీరు మాయదృష్టవశమున నిచ్చటకువిచ్చేసిరి. మాతగవును తాము పరిష్కరించి పుణ్యముగట్టుకొనుఁడని వేఁడుకొనిరి.

అంత ప్రద్యుమ్నుఁడు తగాయిదాపడువారల నిరువురిఁబిలచి మీమీయుద్దేశ్యములను నాకెరింగింపుఁడని జెప్పెను. అందొకఁడు మహారాజా! నేను కుటుంబమునకుఁ బెద్దవాడను. ఈగ్రామమందలి దివాణఁపువారి నౌకరీయంతయును నేనేచేయుచున్నాను. నౌకరీకొరకు కొంతభూమిగలదు. నాయిరువురు తమ్ములును సదరు భూములను స్వాధీనముచేయక రైతును వలలోవైచుకొని సస్యమును నాకింటనీయక కష్టములఁబెట్టుచున్నారు. నిదియే మదీయవృత్తాంతము. తక్కినసోదరులంబిలచి మీతగవేమని జెప్పుండనెను. మహాప్రభూ! మాయన్న పెద్దవాడే! గాని సదరు నౌకరీభూములు మాతండ్రిగారివలన సంపాదింపఁబడినవిగాని మావంశానుగతముగ మాతాతగారి సొత్తుగాదు. 'అది నౌకరీభూమియే? ఆభూములకొరకు విశేషధనమును సమిష్టి సొత్తువలన వ్యాజములువేసి మిగుల శ్రమ దమాదులుపొంది సంపాదించితిమి మాతండ్రిగారున్నంతవరకును సమానముగనే యనుభవించితిమి తండ్రిగారి శవమింటనుండగనే తానావారసత్వపు టుద్యోగమునకై దరఖాస్తుచేసెను. తండ్రిగారి అపరకర్మలకైనను తానొక్కడే కొడుకని మమ్ములం బిలువకయే పితృకర్మలాచరించుకొని తండ్రిగారు పోయినవర్తమానమంపక తల్లిమొగమైనం జూడక నక్క వినయంబులతో తన యాశ్రితబంధువులతో తన తమ్ములకు తనపై ప్రేమలేనట్లు ప్రకటించి రోజులు మరలించుకొనెను. అనిజెప్పగా విని మీచరిత్రము బాగుగానున్నది. ప్రస్తుతము మీతగవును పరిష్కరించుటకు కాలవిలంబమగును. ఎందువలననగా? ఎస్టేటులాండుఆక్టుప్రకారము కుటుంబమునకు పెద్దవాడే అర్హుఁడుగాని యీవిషయముచాల వ్యత్యాసముగ నుండుటచే రివెన్యూబోర్డువారు తండ్రిఆస్తికి కుమాళ్లందరును సమానాధికారులేయని సదరుభూములను సమానముగ నమోజులుచేయుచు

న్నారు. ఆకారణముచే మీతగవు త్వరలో పరిష్కరింపవీలులేదు. మేము చాలదూరమేగవలయును. గాని దాయభాగమును సారించు వాఁడు వ్యక్తినొండజాలఁడు. ఎన్నటికైనను నేలఁబెట్టి కొట్టి తీరును. ధర్మమును కాపాడుకొనుటకు [illegible] తాను ఫలాదులం గొనుటకై బజారునకేగి వలసిన ఫలంబులం స్వీకరించి తిరుగ తమ యాశ్వము చెంతకుఁ జేరి భోజనాదికృత్యంబులం దీర్చుకొని నొకశయ్యపై నొరగి, తిరుగ వేకువయామున లేచి ప్రయాణమై యశ్వము నెక్కెను.

ఇట్లు మధ్యాహ్నమగునరికి గోపాలనగరముఁ బ్రవేశించెను. అందలి పూటకూళ్లబసలు విచారించెను. గ్రామమునందు మిగుల ప్రఖ్యాతినందిన పేదరాసిపెద్దమ్మబస మిగుల ప్రశస్తమని యచటివారిచే వినుటచే అచ్చటనే బసచేసెను. ఆమెయు మిగుల గౌరవమున యువరాజు జూచి బాబూ! దయామయ్యా! మీవంటి మహారాజులం దరును మాయింటనే విడిదచేసెదరు! మొన్న విజయపురంబను గ్రామమునుండి విజయప్రసాదుఁడను మహారాజపుత్రులుగూడ మాయింటనే బసచేసి పాపము ధనము లేక మిగుల చిక్కుఁబడెను. అని చెప్పుచుండ అవ్వా! ఆ యువకుఁడిచటనుండెనా. చిరంజీవిగనుండెనా? నాయనా? చిరంజీవి గాకేమి? సొమ్ములేక నాకప్పుబడి యొక తెలుకులవానియింటఁ బానిసగనమ్ముబడెను. సరే తక్కిన సంగతులు తరువాత విచారించుకొందము అవ్వా నేను మిగుల మార్గాయాసముంజెందియున్నాడను ముందుగా నాకు భోజనసదుపాయములం జేయుము అని చెప్పుటతోడనే యాపేదరాసిపెద్దమ్మ యంగీకరించి యొకగంటలో సర్వమును సిద్ధముచేసి యువరాజును దేవతార్చనకై లంపని తృప్తిగా భుజింపఁజేసెను.

[illegible] సంతుష్టిగ భుజించిన వెనుక సావధానముగ నాపేదరాసిపెద్దమ్మచే తరువాతికథ సంతయును గ్రహించెను. నాయనా? ఆవిజయప్రసాదుండేమి కావలయును దయచేసి చెప్పుఁడని యడిగెను అవ్వా! వారు నాస్నేహితులలో నొకరు పాపమా స్నేహితుఁడు యిడుమలం బడుచుండ నూరకొనలేక సంగతులడిగితిని నాయనా మీవంటిస్నేహితులుండ పాపమా విజయప్రసాదునియిడుమలు తుదముట్ట

కుండునా? గాని యిందలివారుమిగుల మోసకులు మీరు బహుజాగ రూకులై మెలంగుఁడని లోనికరిగెను.

అంత ప్రద్యుమ్నుఁడు పెద్దమ్మవలన సంగతులుగ్రహించి ప్రసాదునెట్లయిన యీతెలుకులివాని బాలినుండి తప్పించుటెట్లని యాలోచించుచుండెను. అంతనొక ప్రతీహారుఁడు టమటమా చేతఁబట్టి రేపటిదినము భోపాలమహారాజుగారి పుత్రిక వివాహమహోత్సవముఁగాన పురజనులెల్లరును వీధులందుండరాదు. మహారాజపుత్రులుండవచ్చును సామాన్యప్రజలుండిన తీవ్రముగ దండింపఁబడుదురని దండోరా వేయుచుండెను. ఆమాటలనువిని ప్రద్యుమ్నుఁడు మిగుల సంతసించెను. తెల్లవాటినది పొరుగూరినుండివచ్చిన మహారాజపుత్రుఁడుగావున తనకేమియును నిర్బంధములేదని తలంచి, బాగుగానలంకరించుకొని యథేచ్ఛగ వీధియరుగులపైఁ బచారుజేయుచుండెను. సూర్యోదయమైన కొన్నినిముషములకు మహారాజగారి ఏనుగను బాగుగానలంకరించి విడువఁబడెను. అనేకదేశములనుండివచ్చిన రాజకుమారులు రాజమార్గములందు బసలువిడచిరి. ఆఏనుగతొండముతో నొకపూలహారముఁ బట్టుకొని రాజకుమారులంజూచుచు తుదకు ప్రద్యుమ్నునిమెడలో నాపూలహారమునువేసెను. అంతనాఏనుగు అక్కడనేవంగి ఆప్రద్యుమ్నుని తనవీపుపైగల విమానముపై నెక్కించుకొని మహారాజు భవనమున కరిగెను. అదృష్టముతప్పింప నెవరితరము? అనేకదేశచక్రవర్తుల కుమారుల కంఠంబున నాపూలదండవేయక నీపురుషరూపమునమన్న ప్రభావతీకంఠంబున దండవేయుట యెంతటి యదృష్టమోజూడుడు. తొల్లిభర్తృహరి "రాకన్నానప్రుహానివృత్తులు మహారణ్యముందాగినను" అను నీతిపద్యమును స్మరించుకొనుచు ప్రద్యుమ్నుఁడు నైరావతంబెక్కెను. ఆగజము తిన్నగా కోటలోనికేగి గొలువునందు విడచెను. మహారాజువచ్చి ప్రద్యుమ్నున కర్ఘ్యపాద్యాదివిధులచే సపర్యలంగావించి, యంతిపురిలోనికిఁ దీసికొనిపోయిరి. మహారాజు తనకుమార్తె సుశీలం బాణిగ్రహణం బొనర్చెను.

అంతనా ప్రద్యుమ్నుఁడు తనలోఁదానిట్లు తలపోసికొనెను. అయ్యో; ఈరాజును మోసగించి పురుషవేషముతో నీసుసీలం

బరిగ్రహించితిని. ఇందేమి గీఁడు మూఁడునో తెలియఁబడదు. నారహస్యము బయలుబడకుండ బహుజాగరూకతతో నుండి త్వరలో నీపురంబువిడచి స్వస్థానముఁ జేరవలెనని నిశ్చయించుకొనెను. తరువాత నీరహస్యము సుసీలకుం దెలిసిన భూపాలమహారాజుచే నెట్టియపకీర్తివచ్చునో యని మనంబు పరిపరివిధంబులఁ బరితపించుచుండెను. తాను వివాహమాడిన సుసీలసంగతి ముందెట్లని యించుకయైనను యాలోచింపకుండెను. క్షత్రియులందు పునస్సంధానము చేసికొను నాచారము పుట్టినింటికడ లేదని చదువరులకు ముందే తెలియును. ఇట్లు రెండుమాసములు మాలువేషముననే నాభూపాలుఁడింటనుండి ప్రతిదినమును పట్టణవిశేషంబులారయుచుఁ బురవిహారము సేయుచుండెను.

ఆగ్రామమందలి తేలీయింటివైపునకు తనయశ్వమునుఁ దోలుచు అందుగల తనభర్తను గుర్తుపట్టి తనభర్తనుపొందు నుపాయము వెదకుచుండెను. ఒకదినమున మహారాజును తానును సిష్టాగోష్ఠితో నుండగా, మహారాజా! ఈగ్రామమందలి తేలివానియింటంగల పరిచారకుఁడు మిగులనేర్పరియని వింటిని. అతనిఁ నాకు ప్రధానసేవకునిగా జేసికొన నుద్దేశ్యముగలదు. వానినెట్లయిన నావశముఁ జేయ గోరుచున్నానని నెను. వెంటనే మహారాజొక పరిచారకుని యాతేలివానియింటికనిపెను. పరిచారకునితో తేలి మహారాజు దర్శనంబునకువచ్చి వేచియుండెను.

మహారాజును నిత్యకృత్యంబులందీర్చుకొని తేలివాని యభిప్రాయమునుఁ దెలిసికొనెను. అయ్యా నేనాపేదరాసి పెద్దమ్మవద్ద రెండు వేలకుఁగొంటిని. తామిపిలపించి యడుగవచ్చునని నెను. వింటిని సేవకుని మాయింటనేయుంచి పొమ్ము! నీకు సొమ్ముపంపెదనని లోనికరిగి మరి రెండువేలధనముగ వేసి మొత్తము నాల్గువేలరూప్యంబులా తేలివానికంపెను. తేలియు మిగులసంతోషించెను. నాటినుండియు, నూతనజామాతయగు ప్రద్యుమ్నునివదనే యాబానిస బానిసత్వముఁ జేయుచుండెను.

## 8 తలవని తలంపు

ఆహా! దైవమాయ! తానొకటితలంప వేఱొకటిజరిగెను. ప్రద్యుమ్నుఁడు శయ్యాతలంబు జేరియిట్లు తలపోసికొనుచుండెను. "భర్తచే బానిసత్వముఁ జేయించుకొనవలసి వచ్చినది. పరుల బానిసత్వమును

మాన్పి నానశముఁ జేసికొంటినిగదా ! దీనికేమి? ఈకోటయందీమర్మము బయలుపడీన గీడుమూఁడును. ఇక నెల్లయినఁ ద్వరలో బ్రయాణసన్నాహముఁజూడవలెను. ఇల్లుబయలుదేరి రెండునెలలయ్యెను. నూతన వివాహమను మిషచే మహారాజనకుఁ జెప్పి ప్రయాణ సన్నాహముఁ జేయవలెను. ఇంతవరకు తలంచిన కార్యములన్నియును నెరవేరినవి. ముందు కార్యమునకుఁ గడంగెద" ననుకొనుచు నిదురించెను.

తెల్లవారెను. ప్రద్యుమ్నుఁడు నిత్యకృత్యంబులుఁ దీర్చుకొని గుఱ్ఱమెక్కి పురంబువైపునకుఁ బోవుచుండెను. అక్కడ జనులు కొందరు పెద్దపెద్దగుంపులుగూడి తగవులాడుకొనుచు డిరి. తనగుఱ్ఱము నావైపు నకుఁబోనిచ్చి యటనిలిపి యాతగవును వినుచుండెను. అచ్చటిప్రజలు ప్రద్యుమ్న మహారాజునుఁజూచి; మహాప్రభూ ! చిత్తగింపుఁడు. "ఈ తండొక తెలుచాటు పత్రికాధిపతి; నేటిబీరకాయఁబోలు గ్రామనరసింహావతారుఁడనెడు పంచశిఖాడి సార్థకనామము సదాపూజ్యులగు నాయకులనుఁ దూషింపుచుండును. అంతలో మరియొకఁడువచ్చి మహారాజా ? ఈతఁడొకపర్యాయము తనప్రతికలో నిట్లువ్రాసెను.

సీ. ఆనాఁడు లంకలో రావణాసురుఁగొల్చి మద్దిళ్లు
మూసేటి మాలలార
తోలుతనమ్మినతవ్వ తొడక్రిందబెట్టుకమరి
తవ్వనమ్ము దుర్మార్గులార
అక్కరదంటకు నతీవేడ్కతోఁబోయి
లెక్కకూడిన మాలకుంకలార
పెండ్లామునంగట్లొబెట్టి బేరములాడు
లాభమార్జించు గులాము లార

అని తనకు సంఘమునందుగల గక్కసమంతయునుఁ బ్రకటించెను.

పైవ్రాతలన్నియును తనకుగలబుద్ధిలేగాని యన్యములుగావు. యిట్టివానిని విడువక దూషించి తిట్టిపోయుచుండ తమదర్శనములభించెగాన వీఁడేదియో జెప్పుకొనుచున్నాఁడు. చిత్తగింపుఁడు.

ప్రద్యుమ్నుఁడు—ఓయీ ! పత్రికాధిపతీ ! వింటివా సమాచారములు నిజమేనా ?

## మూడు చెప్పుదెబ్బల కథ.

అయ్యా ; మహారాజా ! నాకొకగుమాస్తాయుద్యోగముకలదు. నాకును పత్రికకును సంబంధములేదు. నాభార్యకు పత్రికయందు సర్వహక్కులునుగలవు. నన్ను వీరు జుట్టుముట్టి పాదరక్షాప్రయోగంబులు తెరపిలేక ప్రయోగించిరి. వారిపాదంబులపై బడితిని ఇంక నట్టివ్రాతలు వ్రాయించకుండ నాభార్య పాదములంబట్టి బ్రతిమాలుకొందునని ప్రమాణ మొనర్చినను ఎవరియిచ్చవచ్చినట్లువారు దూషింపుచుండిరి. నన్నీబాధనుండి దప్పించి రక్షించుభారము మీయదేయని మహారాజు పాదంబులంబడివిలపించెను. అంతలో మరియొకండువచ్చి మహారాజా ! ఇదివరకెన్నోపర్యాయములీవీడుతప్పించుకొనినాడు ఈసారివీనినివిడువరాదు మావారు కొందరు చాటుచాటున ధనమిచ్చి పోషించుచున్నారు. అందుచే సీతనియాటలు నేటివరకును సాగించుచున్నాడు. మహాప్రభూ! యని విన్నవించెను. ప్రద్యుమ్నుండు సరే జరిగినది జరిగినది. ఇంకముందట్టివ్రాతలు వ్రాయనని లెంపలువైచుకొనుచున్నాడు ప్రస్తుతము విడువుము ఓ పత్రికాధిపతీ! ఇంక ముందట్టివ్రాతలు వ్రాయకుందువేని నీకు క్షేమముం గలుగును. పొమ్ము. అని సాగనంపెను. ప్రజలు మహారాజు మూలమునం దప్పించుకొని పోయెనని గుజగుజ లాడుకొన సాగిరి.

ఒకదినమున ప్రద్యుమ్నుండును మహారాజును నిష్టాగోష్టితో నుండ మామగారితో నిట్లనియె. మహారాజా నేనిలుబయలుదేరి రెండు మాసములయ్యెను. "తలువని తలంపుగ" మీసంబంధముం జేకూరినది. ఈశుభవర్తమానము మాతల్లిదండ్రులకుం దెలిపి పునస్సంధానముం గావించుకొనవలెనుగదా! తాము సాధ్యమైనంతత్వరలో మాప్రయాణమును సాగింపం గుతూహలమొందుచున్నానని సవినయంబునం జెప్పజామాత తోనిట్లనియె.

ప్రద్యుమ్నా? ఏల నింతతొందర. మీదేశంబరగిన నింకమీకు స్వేచ్ఛయుండునా? మీతండ్రిగారికి వర్తమానముం బంపెదను. ఇంకనొక నెలదినములిట్లు స్వేచ్ఛగా నీరాజ్యమందు విహరింపుడు. ఇందుగల వ్యవహారంబుల సంస్కరింపుడు. ప్రద్యుమ్నా ? నాకిక కుమారులు లేరు. మీరే నాకు జామాతలైనను పుత్రులైనను ఎన్నటికైన యీభోపాల

కార్యభారమును వహింపవలసినది మీరే మీరెట్లు జేయుమన్న నట్లు మేమెల్లరమును వర్తించువారము.

అంత నా ప్రద్యుమ్నుఁడేమియుఁ బలుకనేరక తామెప్పుడు మమ్ములను సాగనంపెదరో ఆభారమంతయును తమదే? త్వరలో నొక పర్యాయము మా జననీజనకులం జూచి మగుడి మేమిరువురమును తరలి మీయభిమతంబు నెరవేర్పఁగలమని యానఁజెసెను. భూపాలుఁడు నల్లుని వచనంబులకు మిగుల సంతోషించి కుమార్తె సుశీల నత్తవారింటికనుపు సన్నాహంబులఁ గావించుచుండెను.

ఇట్లు మూఁడుమాసములు కాఁజొచ్చెను. ప్రయాణముహూర్తము మరినాల్గుదినంబులుండెను. సుశీల నత్తవారింటికనుపు సన్నాహంబులుపూర్తియయ్యెను. పౌరులుత్సాహపూరితులై పురంబంతయు నలంకరించిరి. ఈలోగా ప్రద్యుమ్నుఁడొక రజతసిరాయు నొక కాగడా కిర్రియుఁ జేయించి తనయొద్ద నుంచుకొనెను.

మహారాజు ప్రయాణంబు సిద్ధముజేసి సుశీలకు సారెచీరలు దాసదాసీజనంబులు, వస్తువాహన విశేషంబులును అలంకరణంబులును, కాశ్మీరధోవతులును, గట్టిగొంగళ్ళు లెక్కకు మిక్కిలిగా ననేకచిత్రవిచిత్రంబులగు వస్తువిశేషంబులతో శృంగారముగా వెడలిపోవలయుఁగా ప్రద్యుమ్నుఁడు వసింప సుశీలయు తలిదండ్రులకు నమస్కరించి సంతోషంబున నొక వెండిపాలకీయందెక్కెను. ప్రద్యుమ్నుని సేవకుఁడు వెండి కాగడాతో కాగడాయు ఆపాదపుసిరానుఁదీసికొని ప్రద్యుమ్నుని స్వారీ వద్దనే దివ్వెవేయుచుండెను పౌరులెల్లరును వెంటరా మహావైభవంబున మంగళవాద్యంబులతో బురంబంతయు నూరేగించి పొలిమేరఁదనుక నందరును ప్రద్యుమ్నునకును, సుశీలకును శుభంబగుఁగాక యని మంగళాశీర్వచనంబులుసలిపి సాగనంపిరి.

అటనుండి మార్గంబు నిరపాయంబుగనుండుటకునై మహారాజు గొందర చోపుదారీభటులను సహాయముగనిచ్చెను కాగడా వేయుచుండిన బానిస ప్రద్యుమ్నుని పాలకీవెంటనంటుచు నేర్పుతో రాజునకు హితవుగలుగునటు మెలఁగుచుండెను. ఇటు కొంతదూరం బరుగుసరికి

[illegible]

మాయవేషంబుతోనున్న ప్రద్యుమ్నునిపేరుతోనున్న ప్రభావతి [illegible] గారి దేశమునకుంబోవు మార్గముసమీపించుచుండెను.

చేరవలసినది విజయపురము. ప్రభావతిమాత్రమెట్లయిన విధి వారినుండి తప్పించుకొని వీరుగమ్యస్థానముచేరకముందే తల్లిదండ్రులం జూచి అక్కడనుండి విజయపురముందలి అత్తవారింటనుండవలెను.

ప్రద్యుమ్నుండాపాలకిని నిలిపి భానిసంబిలచి; అయ్యా! మీర లెవ్వరో గొప్పవంశమువారివలె గాన్పించుచున్నారు. మీయుదారతము తెలియదు. మానిసత్వమేలజేయవలెనో బాగుగా తెలియనట్లు కన్పట్టుచున్నది గాన నేనొక్క యుపాయంబుం జెప్పెదను. చేరిముందలికాగడా యును, సిద్దెయును యిట్లు రెండనితీసుకొనెను. ఈవు చాలవినయవిధేయతంగలవాడవు మేము రేపటికి విజయపురంబుచేరవలెను. నాకుకొన్ని రాచకార్యంపు తొందరలుగలవు. మేమిటనుండి యీమార్గంబున పాంచాలమేగిరావలయును. అటనుండివెంటనేరత్నభాగమీదుగ విజయపురంబుచేరగలను. గాన నాభార్య సుశీలను దాసదాసీజనంబులను అశ్వ ఆందోళికాది సకలపరివారంబును మీవశముంజేసితిని. గాన బహుజాగరూకతతోనుండి నాయీదుస్తులను ధరించి విజయపురంబున యానంబు సాగించుచుండుడు. అనుటయు ప్రద్యుమ్నుండు తనదుస్తులాభానిసకు నిచ్చు సూత్రంబునవస్త్రయునిధరించి ప్రద్యుమ్నుని పాలకీనుండుగూర్చుండం బెట్టెను. తనంతో భానిసయును విజయపురమునకుసాగుచుండెను. ప్రద్యుమ్నుని కంఠస్వరమువిని యమాత్యులును గ్రహింపగలరు. కాని తనపలికితనకు రాజగుటచే అనుమానించెను

వెంటనే ప్రద్యుమ్నుండొక యశ్వంబునధిరోహించి అతిరయంబున పాంచాలమేగి తానుజేసిన మహాత్కార్యములన్నియుతల్లిదండ్రులకెరిగించి వెంటనేతానొకపాలకీపైనెక్కి ప్రభావతీనామముందాల్చి యత్తవారింటకరగి తనమామూలు వ్యాపారమునందు గాలక్షేపముం జేయుచుండెను

భానిసరాజు తన పరివారమునుందీసికొని విజయపురంబుచెంత కరిగి యొకయుద్యానవనంబున పాలకీలనిలిపి మకాంవిడదిచేసెను. ఎంత సేపటికిని ప్రద్యుమ్నునిజాడ గానరాకుండెను. ప్రద్యుమ్నుండేవచ్చిన

[illegible]

[illegible] పురమునందలి వా[illegible] [illegible]
యాతం డెవ్వరో చూతమని యొకపరిచారునిం బిలచి, ఓరీ ఈలేఖం దీ
కొని మహారాజున కిమ్ము. అంతవరకును మేమిట వేచియుందుము. అం
తండ్రిగారికి వర్తమానమంపెను.

విజయపురాధీశ్వరుం డాలేఖ నిట్లు జదువుచుండెను. "నాప్రియ జననీజనకులకు విజయప్రసాదుఁడు నమస్కరించి వ్రాయుశుభవర్తమానములు. నేను భూపాలమహారాజుచే సత్కరింపఁబడి తనకూతునిచ్చి వివాహమొనర్చెను. నేఁడు సతీసమేతంబుగ స్వదేశమునకుఁ బయనమై మనపొలిమేరయందలి యుద్యానవనంబునఁ బసవిడసితిమి. ఈసమాచారంబు ముందుగ తమకుఁ దెలియపరచు ప్రియపుత్రుండు"

విజయప్రసాదుఁడు.

అని మహారాజు జాబుచూచుటతోడనే మితిలేనిసంతోషంబుచె తాను స్వయముగ పరివారముతో పౌరులును వెంటనే విజయప్రసాదునిఁ జూడ మంగళవాద్యంబులతో బయలుదేరి యుద్యానవనంబు ప్రవేశించిరి. విజయప్రసాదుఁడును తండ్రిగారిరాక నిరీక్షించి ఎదురేగి తండ్రిగారినిఁ గౌగలించుకొనెను. పుత్రసంతోషంబున విజయపురాధీశ్వరునిసంతోష మింతయని జెప్పనలవిగాకుండెను.

అటనుండి వెంటనే పరివారమంతయును బయలుదేరి విజయపుర వీధులనూరేగి కోటయందుఁ బ్రవేసించిరి. ప్రసాదుని తల్లిగుణవతియుఁ సుసీలంజూచి మహదానందంబున కుమారునిప్రజ్ఞావిశేషంబుల కచ్చెరు వందుచుండెను. భూపాలమునుండివచ్చిన పరివారంబునకును సుసీలతో వచ్చిన దాసదాసీజనంబులకును తగువిధంబులగు బసల నేర్పాటుగావించి సుసీలకొక హజారమునందు వసింపఁజేసి మార్గాయాసంబుదీరునట్లు భోజనాదిసదుపాయంబులఁదీర్చి మధ్యాహ్నము కుమారునికుశలంబు లడిగి తెలుసుకొని క్రొత్తవియ్యంకుని వార్తలరసి మహానందంబున నీదులాడుచుండిరి. అంతకుముందే ప్రభావతి పాంచాలమునుండి అత్త వారింటం బ్రవేశించెను. ఇట్లుఎల్లరును స్వదేశంబుజేరి స్వగృహంబున గాలక్షేపముఁ జేయుచుండిరి.

## సమావేశము.

సాయంకాలముగాజొచ్చెను. విజయప్రసాదుడు వి[illegible] బయలుదేరెను. ప్రభావతియు సుసీలక్షేమాబులువిచారించెను. [illegible] మాఱువేషంబున వివాహమాడినదేగావున మరింతచనువుగా మాట్లాడ గడంగెను. పాంచాలమేగిన ప్రద్యుమ్ననిసంగతి సుసీలకుం దెలియదు. సుసీలకు ప్రద్యుమ్నుండే తనభర్తయనిమాత్రముం దెలియును. వీరందఱు నాతని విజయప్రసాదుడని పిలచుచున్నవారు. ప్రభావతి సుసీలయు స్వారీలనాపిన మార్గమధ్యంబునందలి సమాచారములన్నియునుం దెలిసికొని చెల్లెలినిం గౌగలించుకొని సంతోషంబునం గాలక్షేపముం జేయుచుండిరి.

ఒకదినమున ప్రసాదుడు ప్రభావతి హజారంబు ప్రవేశించెను. ప్రభావతియు భర్తగారిరాకను నిరీక్షించుచు మందహాసంబుతో యుచితమర్యాదలంగావించి సుఖాసీనులై యిట్లని సంభాషింపదొడంగిరి.

ప్రభావతి:—నాథా! ఎంతకాలంబునకు తమదర్శనభాగ్యంబు! తామేయే దేశంబులకరిగి ఎట్టిచిత్రంబులంగనిరో వినం గుతూహలమందు చున్నదానను?

విజయప్రసాదుడు:—ప్రాణేశ్వరీ! నాటిరాత్రి నీహజారమ్ము నుండిబయలుదేరి గోపాలనగరంబుప్రవేశించి ఆరాజు చేమన్ననలనంది నాప్రయోజకత్వంబుచే యాతనికూతురు సుసీలం బాణిగ్రహణంబు చేసి కొంటిని. నాసుసీలం దిలకించితివా?

ప్ర:—జూచితిని. ప్రభావతినిం బాణిగ్రహణంబు గావించుకొని సుఖంపుచున్నవారా? అట్టనేసుసీలయు సుఖించునుగాబోలు?

వి:—అట్లంగాదు నాప్రతిన నెరవేరినతరువాత జూచెదవు?

ప్ర:—సరే పురుషులకున్నంతయోచనలు స్త్రీలకుండునా?

వి:—దానికేమి? గాని నిన్నుకష్టపెట్టిననాకేమిలాభము. ప్రతిన నెరవేర్చుకొనుతలంపున నట్లేగితిని?

ప్ర:—ప్రతిననెరవేర్చుకొందురా? ఎట్లు?

వి:—నీకమీదట భోపాలరాజ్యంబంతయును నా యధికారము యాతనికూతుని వివాహంబాడితిని. పునస్సంధానమనుమిషచే స్వదేశ

ముందుకే ప్రభావతిహజారముకడకువిచ్చేసిరి. ప్రభావతియొక్కముఖారవిందమెరప్రశాంతియుండుటనుజూచి అత్తగారు కోడలినిగాగలించుకొని కుశలంబులడుగ నారంభించెను.

ప్రభావతి అత్తమామలకుఁ బ్రణమిల్లికూర్చుండ నియోగించి కుమారుని ప్రజ్ఞావిశేషంబుల నామూలాగ్రముగ ప్రతిజ్ఞాభంగమైన లగాయితు నేటివరకునుజరిగినకథయంతయును బూసగుచ్చినట్లు విస్తరించెను. విజయప్రసాదుఁడు అట్లేనిలువఁబడెను. అత్తమామలకు, ఉత్తరములగాయితు, కాగడావరకును భర్తగారుపొందిన మర్యాదలన్నియును తండ్రిపిని నిశ్చేష్టితుఁడయ్యెను. ప్రద్యుమ్నునియొదగలబంటు బానిసరాజుగారికి సుశీలసంగతులేమి తెలియును? అనటయుఁ సుశీలనుఁగూడ అచ్చోటికరాపించి ఆపెనువివాహమాడినది ప్రద్యుమ్నుఁడా ప్రసాదుఁడా? యని ప్రశ్నింపఁజేసెను. తానుపురుషవేషంబున నెరవేర్చినకార్యంబులు అత్తమామలువిని సుగుణవతియగు ప్రభావతిని మిగులఁగొనియాడి విజయవంశము ప్రభావతివలన పునరుద్ధరింపఁబడినదని బహువిధంబులఁగొనియాడుచు, కుమారునింజేరి నాయనా? నీ విద్యావిశేషంబులు యిట్లు పరిణమించినవి. నీభార్యవలనగదా? నీవు తిరుగ నిటకు స్వదేశంబునకురాగలిగితివి? చాలుఁజాలు నీప్రజ్ఞ? నీపాదరక్షలు నిన్నేవరించినవి? విద్యావతియగు ప్రభావతినీ నీప్రతిజ్ఞనుదీర్చినది? ఆపె మనపాలిటదైవము. ఆమెయిష్టానుసారము మెలగుము. ఇఁకముందెన్నఁడును నిట్టిపిచ్చితలంపులుమాని వివేకవంతుఁడవై మెలంగుమని యనేకప్రకారంబులు కుమారునిమందలించెను. విజయభూపాలుఁడును, గుణవతియు, కోడలుప్రభావతియాచరించిన సాహసకార్యంబులకచ్చెరువందుచు మిగులఁ గొనియాడుచుండిరి. నాటెలగాయితు ఎవ్వరైనను ప్రభావతితో యోచింపనిదే కార్యమునుఁజేయ సాహసింపకుండిరి.

ఇట్లు పరిహాసింపఁబడిన ప్రసాదుఁడు ప్రభావతిఁజూసి సోజాలకుండెను. ప్రభావతియు పతిభక్తిగలదియగుటచే భర్తగారెన్నిచిక్కులంబెట్టిన సరకుఁజేయక ప్రసాదునకుపచారంబులు జేయుచుండె. ప్రభావతియు ననేకవిధంబులఁ భర్తగారిమనస్సునుఁగుదురపరచి తనపాండిత్య

ప్రభావముచే వరింపఁబడినదై ప్రభావతీలతానికుంజంబులు తనుచ్ఛాయలపై నల్లుకొని సుగంధశోభితంబులై యొప్పారుచుండె.

ఇట్లు కొన్నిదినములు గడచెను. ప్రభావతి సుసీలననురాగంబున జూచుచుండెను. ఇకఁ బ్రసాదునకును సుసీలకును పునస్సంధానము గావింపవలెను. అంతవరకును ప్రభావతి మనస్సెట్లు గుసుగుసుపడును. సమయమునకై జూచుచుండెను. ఇట్లనుకొనుచుండ మహారాజగు విజయ భూపాలుఁడు ప్రభావతికడకు వచ్చెను. మామగారికిఁ బ్రణమిల్లి యాశీర్వాదంబులనందెను. ప్రభావతిను దేశించి; అమ్మా? నేడొక కార్యంబునకై వచ్చితిని. మన సుసీలసంగతి విచారింపకుండ నుండఁ జాలక నిట్లువచ్చితిని. నీవేదైనను పాయంబుఁ జెప్పవలయును?

ప్ర:—ఆర్యా! తమకుఁ దెలియని ధర్మంబులు లేవు. నేనెట్లులనో, ఆజ్ఞయునట్టిదే? ఇదమేమి?

వి॥ భూపాలుఁడు—నీయభీష్టమును నెరవేర్తును. మాకుమిగుల సంతోషము.

ప్ర:—అగుటైన నొకపర్యాయము రాజబంధువులనెల్లరను నాహ్వానించి, సుసీలను భర్తగారికి పాణిగ్రహణంబులవిగాగల శుభంబులెల్లను యథాశాస్త్రీయముగ నెరవేర్చుటయె నాయభిమతంబు !!.

వి॥ భూ:—సంతోషము తల్లీ నేటినుండియే తగుప్రయత్నంబులు గావించెదను. నీవు నీయిష్టానుసారము రాజబంధుల సరఫరాలన్నియును నియోగించి యాచరింపుము. నేనిదే భోపాలమహారాజాధిరాజులకెల్లరకును శుభలేఖలంపుచున్నానని తన యంతిపురంబుఁ జేరెను.

సుముహూర్తము నిశ్చయింపబడెను. పాంచాలభూపతులయొక్కయు, భోపాలనగరాధీశులయొక్కయు, పరివారసమేతంబుగ విజయపురంబు ప్రవేశించిరి. వారికేదగిన బసల నేర్పాటుగావింపఁబడెను. భోపాలమహారాజునకు విజయభూపాలునితో వియ్యంబందుట మిగుల సంతోషదాయకముగ నుండెను. పాణిగ్రహణంబు మిగుల వైభవముతో నెరవేరెను. సుసీలప్రసాదులకు పునస్సంధానముఁగూడ జరిగెను. కొన్నిదినంబులు విజయపురమందే సుసీల తల్లిదండ్రులుండి ప్రసాదుని, సుసీలను, ప్రభావతిని తమరాజ్యంబునకుఁదీసికొని వెళ్ళిరి. కొన్నిదినంబు

స్వేచ్ఛగా గాలక్షేపము చేయుచుండిరి. ప్రభావతి గర్భంబు దాల్చెను. అయిదుమాసంబులచ్చటనే గడపెను. విజయభూపాలుఁడు పోడండ్రినుఁజూడ తలంపుతో భోపాలనగరమువిచ్చేసి ప్రభావతిని వెంటబెట్టుకొని విజయపురమేగెను. విద్యావతిగారుగు ప్రభావతి తల్లిదండ్రులకీ శుభవర్తమానమంపబడెను. పాంచాలభూపతి యాటనుండి విజయపురంబువచ్చి కూతునికి వేడుకలాచరించి ప్రభావతినిఁ దోడ్కొని పోయెను. ఇట్లెల్లగును సంతోషసాగరంబునఁ దేలుచుఁ గాలము గడుపుచుండిరి.

పట్టాభిషేకము.

ప్రభావతి పుట్టినింటికరిగినది. విజయభూపాలునకును, గుణవతి కేమియుఁదోచుటలేదు. ప్రభావతికి నవమాసంబులు నిండెను ప్పుడేమి వర్తమానము వినుగుమో యని నిరీక్షించుచుండిరి. భోపాలనగరమునుండి సుసీలయు గర్భవతియైనదని వర్తమానమువచ్చెను. దం పతులీవర్తమానములను విని మిగుల సంతోషించిరి. సుసీలకు వేడుకలాచరించుటకు గుణవతి భోపాలమునకుఁబయలుదేరెను. పాంచాలము నుండి విజయప్రసాదునకు పుత్రుండు కలిగెనని శుభవర్తమానమువచ్చెను. ఆ పూటనే యీవార్త భోపాలమునకునుఁ జేరెను. ఎల్లరును సంతసించిరి. బారసాలమహోత్సవమునకు నాహ్వానింపఁబడిరి. భోపాలమునుండి విజయప్రసాదుఁడును, గుణవతియు, సుసీలతల్లియు, పాంచాలమేగిరి. విజయపురమునుండి మహారాజు విచ్చేసి మనుమని బారసాలమహోత్సవమును మహావైభవంబుగ జరుపుకొనిరి. మనుమని నాశీర్వదించి "విజయభూపాలుఁడని" నామకరణంబొనర్చిరి.

పాంచాలభూపతియు రాజబంధువులనెల్లరను మహావైభవంబుగ వేడుకలుగావించి వారివారి దేశంబులకు సాగనంపెను. ఇట్లు పది మాసములుగడచెను. ప్రభావతి పుత్రవతియై తిరుగ నత్తవారింటికేతెంచెను. చెల్లెలు సుసీలకును పుత్రుఁడుదయించెనని వర్తమానము వచ్చెను. ఆరాజుచే బారసాలమహోత్సవమునకాహ్వానింపఁబడెను. తిరుగ వీరెల్లరును భోపాలనగరమునకుఁ బ్రయాణముసాగించిరి. మహా సంతోషంబున భోపాలమహారాజు మిగులసంతోషించి బారసాల

మహోత్సవము సలిపెను. రాజబంధువులెల్లరును సర్వ్యాయు యుష్మంతుఁడవగుగాక!" యనిదీవించి "ప్రద్యుమ్న విజయుఁడని కరణంబొనర్చిరి. విజయభూపాలుఁడు వియ్యంకునిచే సపర్యలంది కొన్నిదినంబులట విశ్రాంతిఁ దీర్చుకొనుచుండెను.

ఒకదినమున నిష్ఠాగోష్ఠితోనుండ విజయభూపాలునితో భోజ మహారాజిట్లని జెప్పదొడఁగె. మహారాజా! నాకు పుత్రులేరు జామాతలైనను, పుత్రులైనను, మీవిజయప్రసాదుఁడే. ఈరాజ్యంబు పరులయధీనముఁగాకుండ మీవిజయునకు పట్టాభిషేకమొనర్చి నేను తపోవనంబున కేగెదను. మీయాజ్ఞ ఏమని ప్రశ్నించెను? ఆర్యా; తమకుఁ దెలియని ధర్మంబులులేవు, నేనును పెద్దవాఁడనైతిని నాకుమాత్రమిట్టి కుమారుఁడు నాకికి రాజ్యంబునందలి కాంక్షవదలినది. నేనిబిడ్డలం జూచుకొని గాలక్షేపముఁ జేసెదను. మీరాజ్యమున కర్తృఁడుదయించె నుగదా? "ప్రద్యుమ్న విజయుఁడు" అని మందహాసముతో బలికె అంతటితో నావ్రిస్తాపన ముగిసెను.

బారసాల మహోత్సవముఁగావించుకొని గుణవతియు, ప్రద్యుమ్నుఁడును, ప్రభావతియు, తిరుగ వెంటనే విజయపురము జేరిరి. గుణవతి మనుమనిఎత్తి ముద్దాడుచు నేటికిఁగదా మనయింట పసిపాపలల్లాడుచుండిరని యుబలాటమొందుచుండెను. విజయప్రసాదుఁడును పుత్రసంతోషంబున గాలక్షేపముఁ జేయుచుండెను.

విజయభూపాలుఁడు భోపాలమునుండి విజయపురము ప్రవేశించెను. మంత్రుల పరిపాలనమును పరీక్షించెను. ప్రజలు మహారాజునకు మహిమలుదయించెనని వేడుకలుగావించుకొనిరి. విజయభూపాలుఁడు తనరాజ్యమునందలి ప్రజలు సంతోషించుటకు ఆసంవత్సరము పన్ను గనకట్టరలేదని శాసించెను. ఆమహారాజు ప్రకటనను విని రాజాస్థానికుల బహూకరించిరి. ఆసంవత్సరముస్వంతఖజానానుండిరాజకార్యములకై ధనమును ఖర్చుపరచిరి. మహారాజు ఔదార్యమునకు పదునెనిమిది పరగణాలనుండియు ప్రజలుసభలుచేసి యనేకబిరుదములుప్రసాదించిరి.

సుసీలయు పుత్రవతియై సుఖంబుగ నత్తవారిల్లుచేరెను. ప్రభావతీ సుసీల యన్యోన్యప్రేమకెల్లరును సంతోషింపుచుండిరి. సుసీలయు

భావతినొద్ద విద్యనేర్చుకొనుచు ననేకధర్మంబులను వినుచుండెను.
భావతియు తనరాజ్యంబునందుగల స్త్రీలకెల్లరకును నుచితపాఠశాల
ను నెలకొల్పజేసెను. ఇట్లు అత్తకోడండ్రు, మనుమలు సుఖంబుగ
లంబుగడుపుచు నాటపాటలతో జీవయాత్రఁ గడపుచుండిరి.

మహారాజు మిగులపెద్దవాడయ్యెను. విజయప్రసాదునికి పట్టాభి
షేకమొనర్పఁ గుతూహలముకలిగెను. పండితులచే సుముహూర్తము
శ్చయింపఁబడెను. నేబదియారు దేశంబులవారికిని శుభవర్తమానము
ంపఁబడెను. పురంబంతయు మిగులశృంగారముగ నలంకరింపఁబడెను.
కలభూపతిసామంతప్రభువులెల్లరును పట్టాభిషేక మహోత్సవమునకు
చ్చేసిరి. నాటిదినము పదిగంటలకు ముహూర్తము. రాజులెల్లరును
ర్బారునకేగిరి.

విజయప్రసాదుఁడు శ్వేతాశ్వతులపై నధిరోహించి పౌరులెల్ల
ంగళాశీర్వచనంబులుఁబలుక మేళతాళంబులతో నూరేఁగి దర్బారునకు
చ్చేసెను. తండ్రి విజయభూపాలునకునమస్కరించి నొకయాసనంబునఁ
ూర్చుండెను.

అంత భూపాలుఁడిట్లని యుపన్యసింప ప్రారంభించెను. "మహా
రాజాధిరాజులారా! శ్రీమంతులారా!! నాకు డెబ్బదివత్సరములు నిం
నవి. నాపాలనంబులో ప్రజలును, పాలకపాలితులును, సుఖంబుగ
ాలమునుఁగడపిరని నాయభిమతము. ఇఁక నాకీరాజ్యవ్యవస్థఁదీరినది.
కిడిదే మీసమక్షమందు నాకుమారుఁడగు నీవిజయప్రసాదునకు రాజ్య
ారమును వప్పగించుచున్నాడను. ముందు నాయెడల తామెల్లరును
ూపిన యుదారభావమునే వీనియందును జూపెదరని నామనోనిశ్చ
యము. సుముహూర్తము సమీపించినది. ఈకిరీటమును ప్రసాదుని
రస్సున నలంకరింపఁజేయుచున్నానని ప్రసాదుని శిరస్సుపై నాకిరీటము
ంచెను. అంతట మహారాజులెల్లరును పుష్పవర్షమును గురిపించిరి.
నేకములగు గానుకలనర్పించిరి. వీనినన్నింటిని విజయప్రసాదుండు స్వీక
ించి యిట్లని చెప్పందొడంగెను.

"మహారాజులారా! సామంతప్రభువులారా!! పౌరులారా!!!
ాతండ్రిగారిచే యీమహోత్సవము గావింపఁబడి రాజ్యభారము

# మూడు చెప్పు దెబ్బల కథ.

ప్రేమతో నప్పగింప వందనములతో స్వీకరించితిని. మీరెల్ల యీమహోత్సవమునం జూచుటకునై శ్రమదమాదులతో నిటకువి నందులకు వందనసహస్రములాచరించుచున్నాను. మాతండ్రిగారి నతుడనే మీరును నాకు సహాకారులై తగిన సలహాలనొసంగ చున్నాడను. నారాజ్యమునందలి ప్రజలెల్లరును సౌఖ్యదాయకమ జీవయాత్రగడపవలెనని యాశించుచున్నాను. అన్నిదేశములందు క్షామమనుమాటలేక సుభిక్షముగనుండ నాశించుచున్నాను. నే రాజ్యభారమునువహించుట కిష్టుడనుంగాకపోయినను తండ్రిగారి యాజ్ఞను శిరసావహించుట ధర్మపథముగాన నింతటితో నీసమావేశము చాలింప ననుజ్ఞ వేడుచున్నాడను." అని యుపన్యసించి సింహాసనము నందుం గూర్చుండెను.

కవీశ్వరులు "విజయప్రసాదుని" స్తుతించుచు గీతములంబాడిరి. మంగళతూర్యరవంబులు మిన్నుముట్టెను. పురోహితులు మంగళహారతు లొసంగిరి. పరిచారకులు కైవారములుసేయుచు మహారాజునకు జే జయధ్వనులంగావించిరి కొంతసేపు దర్బారంతయును నిశ్శబ్దము నుండెను. ప్రధానమంత్రి మహారాజులదరను ఒక్కొరొక్కరి నెరుకపరచుచు కరస్పర్శంబులచే బహూకరింపంబడిరి. తరువాత సామంత రాజులను తక్కుంగలవారిని నెరుకపరచిరి. అంతటితో సభముగిసెను. "విజయప్రసాదమహారాజును భగవంతుండు రక్షించుగాక" యనిశబ్దములు మిన్నుముట్టెను. అంతటితో ఎవరిస్థానంబులకువారు చేరిరి.

పండ్రెండుగంటలయ్యెను మహారాజును, విజయప్రసాదుండును నేబదియారుదేశాధీశ్వరులతో సహపంక్తియుక్తులై షడ్రసోపేతంబుగ భుజించి ఎవరిదేశంబులకువారిని సాగనంపిరి. ఇట్లు విజయప్రసాదుండు రాజ్యభారమును స్వీకరించి ప్రభావతీప్రసాదంబున తనకింతవైభవముం గలిగెనని మనంబునందు జ్ఞప్తియుంచుకొని ప్రజలను బిడ్డలవలెంగాపాడుచు చిరకాలంబు సుఖంబుగ రాజ్యంబు నేలుచుండెను.

మంగళంమహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

సంపూర్ణము.

—:o:—

| | |
|---|---|
| [illegible] భాష్యము | 9- 0 |
| భాగవద్గీత | 1- 0 |
| డిటో భాష్యము | 1- 4 |
| డిటో రామానుజభాష్యము | 8- 4 |
| శుష్క వేదాంతతమోభాస్కరం | 1- 4 |
| డిటో గ్లేజు, క్యాలికో | 2- 0 |
| బాలబోధామృతము | 0- 8 |
| తారకామృతసారము | 0- 4 |
| జన్మరాహిత్యసాధన | 0- 8 |
| సుజ్ఞానరత్నావళి | 0- 6 |
| కాలజ్ఞానతత్వాలు | 0- 3 |
| కాలజ్ఞానవచనము | 0- 2 |
| పనారీవిశ్వేశ్వరసంవాదం | 2- 0 |
| రాజయోగసాధన | 1- 0 |
| హఠయోగప్రదీపిక | 2- 8 |
| ఘటశోధని | 0- 8 |
| వాసుదేవమననము | 0-12 |
| రాజయోగరత్నాకరము | 2- 0 |
| గురుగీతాసారము | 2- 8 |
| శుద్ధనిర్గుణతత్వకందార్థ మూలటీకాతాత్పర్యము | 0-12 |
| వేదాంతప్రశ్నోత్తరరత్న మాల | 0 -6 |
| కైవల్యామృతసారము | 0- 6 |
| శివభక్తితత్వజ్ఞానకీర్తనలు | 0- 6 |
| గురుశిష్యసంవాదము | 0- 8 |
| [illegible]మగురుబోధామృతం | 0-12 |

[illegible]
సంగీత[illegible]
గానవిద్యా[illegible]
సంగీత[illegible]
సంగీత విద్యా[illegible]
త్యాగరాయకృతు[illegible]
ప్రబంధము[illegible]
పాండురంగమహాత్మ్య[illegible]
వసుచరిత్ర మూలము
డిటో టీకాతాత్పర్యము
క్యాలికోబయిండు
మనుచరిత్ర మూలము
డిటో టీకాతాత్పర్యము
క్యాలికోబయిండు
సారంగధర
శ్రీమహాభాగవతము
డిటో భాష్యము
డిటో రెండు వ్యాఖ్యాము[illegible]
డిటో భాష్యం రెండు వ్యాఖ్యాములు
ఉత్తరరామాయణము
శ్రీమహాభారతము.
ఆదిసభాపర్వము[illegible]
అరణ్యపర్వము
విరాటోద్యోగపర్వములు
భీష్మద్రోణపర్వములు
శాంతిపర్వము
కర్ణశల్య సౌప్తికస్త్రీ పర్వములు

"వచ్చితిస" అని మొదటివ్యక్తియనెను.

నాయనలారా! ఈపరికరణము వ్రాయుటకు నాకును-చదువుటకు మీకునుగూడ చిక్కుగానేయుండును. ఎందువలననని యడుగుచున్నారా? వారెవ్వరో మనకు తెలియదయ్యెను. పోల్చుకొనుటకు దగిన యవకాశములు లభింపవయ్యెను. వారెవ్వరో తెలిసికొను పర్యంతము వారిరువురనుగూడ వ్యక్తులనియే బిలువవలయును. ఇది కష్టముగాదా? ఈచీకటిలో చిందులాట సులభమా? కానిండు మనమేమిచేయగలము. మనసౌకర్యమునకై యొకటి, రెండు, అను యంకెలుంచి యీయిరువుర నంకెలనుకొని వ్యవహరింతము. అందేమి ప్రమాదమున్నది. ముందు పలుకరించినవ్యక్తి రెండనియు, తరువాత పలికినవ్యక్తి యొకటనియు బిల్చుకొని కథాకథనములోనికి బోదము.

రెండు—ఒక్కడవేవచ్చితివా ?

ఒకటి—అట్లేరమ్మంటివిగదా ?

రెండు—నమ్మవచ్చునా ?

ఒకటి—త్రికరణశుద్ధిగా !

రెండు—చేతియందు బిస్తోలున్నదా ?

ఒకటి—నీకో ?

రెండు—నాకు దానితోబనిలేదు.

ఒకటి—నీకు వెనుకసహాయమున్నట్లున్నది ?

రెండు—అగును.

ఒకటి—నాకు వెనుకసహాయము లేనుగాన పిస్తోలున్నది.

రెండు—నేను నీకిచ్చెట్టికీడును దలపెట్టలేదే.

ఒకటి—నేనేనా నీకు కీడుదలపెట్టినది ?

రెండు—అట్లయిన సంతోషమే. నీవీవ్యవహారమును విడచిపోయెదవా ? లేదా ?

ఒకటి—నేను దీనిని తుదముట్ట జూతును.

రెండు—నీతరముగాదుసుమా ?

ఒకటి—అప్పు డాలోచింతునులెమ్ము.

రెండు—వలను. ఇప్పుడేపొమ్ము. అట్లయిన మిగిలిన వారు జీవింతురు ?

ఒకటి—వారి శిగపూవైన నిఁక వాడకుండ చేయగలను.

రెండు—అదికల్ల.

ఒకటి—నీది నిరర్థకప్రయత్నము.

రెండు—వృథావాగ్వాద మెందులకు ? కత్తిగట్టెద వనుమాటయే.

ఒకటి—కత్తినదివరకే గట్టితిని. విడువవనుమాటయే నాయని యడుగుము.

రెండు—అట్లే యుంటిననుకొమ్ము. ఏమందువు ?

# గణపతి

౧వ భాగము రు. 0-12-0.   ౨వ భాగము రు. 0-12 0.

ఆంధ్రదేశములో పుస్తకరచనయందు మిగుల ప్రఖ్యాతిగాంచిన బ్ర॥ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే రచియింపఁబడినది. వీరు రచియించిన నవల లన్నింటిలో మిగుల హాస్యరసప్రధానమైనది. చదువమొదలిడినతరువాత ముగించువరకు నవ్వలేక కడుపు చేతబట్టవలసినదే. వీరిశైలిని గురించి తెల్పుటనవసరము.

# కన్నపుదొంగ

అలివేణి సహాయమువలన దొంగయగు సతారాము చేయు అత్యద్భుతపుపనులు, డిటక్టివు ఆఫీసరు అయిన వల్లభరావుగారు పడినపాట్లు ప్రతివారిహృదయము నాశ్చర్యము నొందించును.

వెల రు. 0 12-0

# పగటిచుక్క

మొ॥ భాగము రు. 0-12-0.   రెం॥ భాగము రు 0-12-0.

ఆస్మాఖము, మాణిక్యము చేయుపనులు. పగటిచుక్క ప్రతిపనియు ముందు తెలిపియే చేయుచుండును. అన్నియు అద్భుతకార్యములే. ఒకదానిని మించిన అద్భుతము మరియొకటి. ఒకదానికంటె దుండగము వేరొకటి. Most Thrilling వేయేల, యీపుస్తకములు చదువ మొదలిడినతరువాత ముగించువరకు చుట్ట కాల్చుటకుగాని, పొడుము పీల్చుటకుగాని తీరికయుండదనుట నిశ్చయము.

ఈమూటికథయు ఒకదాని కొకటి సంబంధించియే యుండును. ఇది యింగ్లీషుభాష ననుసరించి ప్లాటు చేయబడినది. తెలుగునం దిట్టి నవలలు లేవనుట నిశ్చయము.

ఈమూటికిని కలిపి వ్రాసిన రు. 2-0-0 మాత్రమే.

సర్చ్‌లైటు బుక్కు డిపో, రాజమండ్రి.